# పరిణీత

శక్తి ప్రహారం సూటిగా గుండెకు తగిలినప్పుడు లక్ష్మణుని ముఖం నిజంగా వైవర్ణ్యాన్ని పొంది వుండవచ్చు— కాని, తన భార్య అయిదోసారి మళ్ళీ కూతుర్ని కన్నదని సూతికా గృహంనుంచి ప్రొద్దున్నే కబురు రాగానే గురుచరణుడి ముఖం అంతకన్న మరీ నల్లపడి పోయింది.

గురుచరణుడు నెలకు అరవై రూపాయలు తెచ్చుకుంటున్న బ్యాంకి గుమాస్తా. బాడుగ జట్కా గుర్రం శరీరంలా అతడి శరీరం శుష్కించి ఎలా శల్యావశిష్టమయి వుందో, అలాగే కళ్ళూ ముఖంకూడా నిర్వికారంగానూ, నిర్లిప్తంగానూ వున్నాయి. ఇవాళ ఈ భయంకర శుభవార్త వినగానే అతడి చేతిలోని హుక్కా—గొట్టం అలాగే వుండిపోయింది. తాతల నాటి చినిగిపోయిన బాలీసు గోడకు చేరగిలవేసి కూర్చున్నాడు. గట్టిగా నిట్టూర్చే వోపికయినా లేదతడికి వంట్లో.

అసలీ శుభవార్త పదేళ్ళ మూడో కూతురు అన్నాకాళీ మూటకట్టుకు వచ్చింది. "రా నాన్నా! చూతువుగాని" అన్నదాపిల్ల.

గురుచరణుడు కూతురి ముఖంకేసి చూసి "ఒక గ్లాసు మంచినీళ్ళు తెచ్చిపెట్టు అమ్మా!" అన్నాడు.

ఆ పిల్ల మంచినీళ్ళకోసం వెళ్ళింది. అది వెళ్ళిపోగానే ...చరణుడికి మొట్టమొదట పురిటింటికయ్యే ఖర్చులన్నీ ...కు వచ్చాయి. తరువాత— ఉత్సవాలరోజుల్లో స్టేషన్‌లోకి

రాగానే మూడోతరగతి పెట్టె తలుపు తెరచుకొని యాత్రి కులు మూటలు వేసుకొని లోపలికి చొరబడి ఎలా త్రోసు కుంటారో అలాగే ఎన్నెన్నో దురాలోచనలు అతడి మస్తి ష్కంలో చొరబడి కలవరపెట్ట సాగినాయి. గతసంవత్సరం అతడి రెండో కూతురి పెళ్ళికని బౌబజారులో వున్న రెండంతస్తుల మేడ తాకట్టుపెట్టాడు దాని తాలూకు ఆర్నెల్ల వడ్డీ బాకీ గుర్తుకొచ్చింది. దసరాపండుగలు దగ్గరల్లో కొచ్చాయి. ఇప్పు టికి చిన్నమ్మాయికి చీర - సారె పంపాల్సిన అవసరం ఒకటి వుంది. రాత్రి ఎనిమిది గంటలదాకా కూర్చుని తల పగలకొట్టు కున్నా 'డిబెట్' 'క్రెడిట్' కాలాలు సరిపోలేదు. ఇవాళ మధ్యాహ్నం పన్నెండులోపల లెఖ్ఖలు 'ఆడిటింగ్'కు తీసు కెళ్ళి తీరాలి నిన్ననే పై ఆఫీసరు వచ్చి ఇహనుంచి మురికి గుడ్డలు కట్టుకుని ఆఫీసుకు ఎవ్వరూ రాకూడదు. అలావస్తే జరిమానా పడుతుందని హుకుం జారీచేసి వెళ్ళిపోయారు. ఇంట్లో గుడ్డలు సగానికిపైగా వేయించుకుపోయిన చాకలాడు ఏమైపోయాడో వారంరోజులనుంచి పత్తాలేడు. గురుచరణుడు ఇంక అలా చేరగిలపడికూడా కూర్చోలేకపోయాడు; హుక్కా గొట్టం పైకెత్తిపట్టుకుని పడుకున్నాడు. "భగవాన్! రోజూ యీ కలకత్తా మహాపట్నంలో ఎంతమంది బళ్ళ క్రింద బస్సు క్రింద పడి చనిపోవటంలేదు! వాళ్ళ నాకన్న ఎన్నో రెట్లు ఘులా నీ దృష్టిలో. దయామయా? నీ దయవల్ల మోటారు నా గుండెలమీదనుంచిపోతే ఎంత బాగుండు

అన్నాకాళి వచ్చి, "లే, నాన్నా! మంచినీళ్ళు తెచ్చాను" అంది.

గురుచరణుడు లేచి, గ్లాసునీళ్ళూ ఒక గుక్కలో త్రాగేసి "ఆఁ. వెళ్ళు అమ్మా! గ్లాసు తీసుకువెళ్ళు" అన్నాడు. ఆమె వెళ్ళిపోగానే గురుచరణుడు మళ్ళీ పడుకున్నాడు.

లలిత గదిలోకివచ్చి "మామా! టీ తీసుకవచ్చాను లే" అంది.

టీ పేరు వినిపడగానే గురుచరణుడు మరోసారి లేచి కూర్చున్నాడు. లలిత ముఖం చూచేసరికి సగందిగుల్లు పోయి నట్లయింది "రాత్రి అల్లా మేలుకునే కూర్చున్నానల్లేవుండే, తల్లీ! రా, నా దగ్గరకు వచ్చి కూర్చో అమ్మా!" అన్నాడు.

లలిత కొంచెం సిగ్గుతోనూ నవ్వుతోనూ దగ్గరకు వచ్చి "నేను రాత్రి ఎక్కువసేపు మేలుకోలా" అన్నది.

ఈ గురుతరభారంతో జీర్ణించి అకాలవృద్ధుడైన మామ మనస్సులో ప్రచ్ఛన్నంగా వున్న వ్యథను–ఆమెకన్న బాగా తెలుసుకున్న–వారెవరూ లేరు.

"పోనీలే. అయినా నా దగ్గరకురా" అన్నాడు గురుచరణుడు.

లలిత దగ్గరవచ్చి కూర్చోగానే అతను ఆ పిల్లదాని తలనిమురుతూ "మా తల్లిని ఓ జమీందారింట పడవేయకలిగానంటే– ఒకపనైనా నేర్పిన వాడినవుతాను" అన్నాడు.

లలిత తలవంచుకొని టీ కలుపుతోంది. "ఆఁ. దరిద్రుడైన మీ మామయింట్లో పడటం మూలంగా రాత్రింబవళ్లు

చాకిరీ చెయ్యాల్సి వస్తోంది; కాదు తల్లీ?" అన్నాడు గురుచరణుడు.

లలిత తల త్రిప్పుతూ "రాత్రింబవళ్లు చెయ్యటమేముంది మామయ్యా? అందరూ చెయ్యటంలా? అలాగే నేనూ చేస్తున్నాను" అంది

ఆ మాటకు గురుచరణుడు నవ్వి, టీ త్రాగుతూ త్రాగుతూ "అయితే ఇవాళ వంటసంగతి యేమయినట్లు తల్లీ?" అని అడిగాడు.

లలిత ముఖంపైకెత్తి "ఏం మామయ్యా నేను వండుతానుగా!" అంది

గురుచరణుడు ఆశ్చర్యపోతూ "నువ్వు వండుతావా తల్లీ? నీకు వండటం చేతనవునా?" అని అడిగాడు.

"తెలుసు మామయ్యా? నేను అత్తదగ్గర అన్నీ నేర్చుకున్నాను"

గురుచరణుడు టీకప్పు కిందపెడుతూ "నిజమే?" అని అడిగాడు.

"నిజమే. నేనెన్నాళ్ళనుంచి వండుతున్నానో అత్తనడుగు, చెబుతుంది" అంటూ లలిత తలవంచుకుంది. ఆమె వంచిన తలమీద చెయ్యి ఆనించి గురుచరణుడు మనస్సులో ఆశీర్వదించాడు. అతడికి పెద్దబెంగ ఒకటి తీరిపోయింది.

ఈ యిల్లు రోడ్డుప్రక్కనే. టీ త్రాగుతూ కిటికీలోంచి వీధిలోకి చూడగానే "శేఖర్‌లా వున్నాడే? ఏమోయి! నాయ ఇలా రా!" అని కేకేశాడు.

ఆజానుబాహు అయిన ఓ సుందర యువకుడు లోపలికి వచ్చాడు.

"కూర్చో! ఇవాళ ప్రొద్దున్నే మీ పిన్ని యెంతపని చేసిందో విన్నావా?"

శేఖర్ నవ్వుతూ "యెంతపనేముంది? ఆడపిల్లను కన్నది. అంతేనా?" అన్నాడు

గురుచరణుడు ఒక్కసారి నిట్టూర్చి "నువ్వు అలాగే అంటావులే 'అంతేగా' అని! కాని అందులో ఎంత యిది వుందో నాకొక్కడికే తెలుసు" అన్నాడు.

"అలా అనకు బాబాయ్! ఈ మాటలు పిన్ని విన్నదంటే ఆమెకు కష్టంవేస్తుంది. అదీగాక భగవంతుడు ఎవర్ని ప్రసాదిస్తే వాళ్ళనే సంతోషంగా స్వీకరించాలి" అన్నాడు శేఖర్.

గురుచరణుడు ఒక్క నిమిషం మెదలకుండా వూరుకుని "సంతోషంగా స్వీకరించాలన్న మాట నిజమే. ఆ సంగతి నాకూ తెలుసు. కాని భగవంతుడు వెనకాముందు ఆలోచించడు బాబూ! నేను బీదవాణ్ణి. నాకింతేముంది దేనికి? ఈ యిల్లుకూడా మీ నాన్నకు తాకట్టు పెట్టానాయె. పెడితే పెట్టానులే. దానికి నాకేం విచారంలేదు. శేఖర్! కాని యిదిగో మా.లలితవుందే- ఇది బంగారుబొమ్మ. కేవలం జమీందార్ల ఇళ్ళలో పడాల్సిన పిల్ల చూస్తూ చూస్తూ దీన్ని ఎవరి చేతులోనో ఒకరి చేతుల్లో యెలాపెట్టను చెప్పు. రాజుగారి కిరీటంలో "కోహినూర్" వుండే- అలాంటి కోహినూర్లు అన్ని

పోసుచేసి దీనితో తూచినా సరియైన విలువకాదు. కాని ఆ సంగతి యెవరు గ్రహిస్తారు? డబ్బు లేకపోవటం మూలంగానే యీ రత్నాన్ని ఎక్కడో అక్కడ పారవేయాల్సి వస్తుంది. అలాంటప్పుడు నా మనస్సుకు యెలా వుంటుందో చెప్పు నాయనా! పదమూడు యేళ్లు వెళ్లాయి దీనికి. కాని నా చేతిలో పదమూడు దమ్మిడీలుకూడా లేకపోవటంచేతనే ఇంత వరకు ఏ సంబంధమూ నిశ్చయించలేక పోయాను."

గురుచరణుడి కళ్లల్లో నీళ్లు గిర్రున తిరిగాయి. శేఖర్ ఏమీ పలకకుండా వూరుకున్నాడు. గురుచరణుడు మళ్ళీ చెప్పటం మొదలెట్టాడు. "శేఖర్! చూడు నాయనా! మీ బంధువుల్లో ఎవరికయినా ఈ పిల్లదాన్ని ఇచ్చి చెయ్యటానికి వీలుంటుందేమో చూడుబాబూ! ఈ కాలపు కుర్రాళ్లు చాలా మంది కేవలం కట్నం—డబ్బు చూడకుండా— పిల్ల నచ్చితే చాలు. ఇష్టపడుతున్నారట కదూ చేసుకోటానికి! అలాంటి సంబంధం ఏదయినా దొరికిందంటే శేఖర్! నువ్వు మహారాజు వవుతావని ఆశీర్వదిస్తున్నాను నేను. ఇంకేంచెప్పేది బాబూ! నేను వాడకట్టున మీ ఆశ్రయం చూసుకునే వుండగలుగుతున్నాను. మీ నాన్న నన్ను తమ్ముడిలా చూసుకుంటున్నారు"

శేఖర్ తలవూగిస్తూ "సరే, అలాగే చూద్దాం" అన్నాడు.

"మరిచిపోకు నాయనా! లలిత ఎనిమిదో యేడు వచ్చి నప్పటినుంచీ నీదగ్గరే చదువు సంధ్యలు నేర్చుకుంది కదూ! అది యెంత బుద్ధిమంతురాలో, ఎంత సదాచరస్తురాలో చూస్తూనే వున్నావుగా! పిల్ల యింతవున్నదో లేదో నా

వంటా - చాకిరీ అంతా అదే చేస్తోంది. మా సంసార భార మంతా దానిమీదనే వుందంటే నమ్ము."

ఈ సమయంలో లలిత ఒక్కసారి కళ్ళు పైకెత్తి మళ్ళీ క్రిందకు దించుకుంది. ఆమె పెదవులు మాత్రం కొంచెంగా కదిలాయి అంతే. గురుచరణుకు ఒక్కసారి నిట్టూర్చి "వాళ్ళ నాన్నయేం తక్కువ ఉద్యోగం యేమన్నా చేశాడా? కాని సంపాదించిందంతా పిల్లదానికి కాస అయినా ఇవ్వకుండా దానం చేసేశాడు" అన్నాడు.

శేఖర్ మెదలకుండా వూరుకున్నాడు. గురుచరణు మళ్లీ తనంతట తనే చెప్పసాగాడు. "అతడు ఇవ్వలేకని మాత్రం యెలా లేచెప్పటం! ఆయన ఎంతమంది దుఃఖాన్ని పోగొట్టాడో ఆ ఫలితాన్నంతా మాయీ తల్లికి విడిచిపెట్టి పోయాడు. లేక పోతే ఇంత చిన్నపిల్ల ఇలా "అన్నపూర్ణ" అనకలుగుతుందా? నువ్వే చెప్పు శేఖర్ నిజమో! కాదో..."

శేఖర్ నవ్వుకోటం మొదలెట్టాడు జవాబేమీ చెప్ప లేదు.

అతడు లేచి వెళ్ళాలని ప్రయత్నిస్తుంటేగా "ఇంత ప్రొద్దున్నే ఎక్కడికి నాయనా! బయల్దేరావ్?" అని అడిగి శాడు చటుక్కున.

"బారిష్టరుగారింటికి. కేసు ఒకటి వుంది." అంటూ అతడు లేచి నిలబడగానే గురుచరణుకు మరోసారి అతనికి జ్ఞాపకంచేస్తూ "ఈ మాట కాస్త మనస్సులో పెట్టుకో నాయనా! అది కొంచెం నల్లగా వుంటుందన్నమాట నిజమే,

నమకో అయినా ఇలాంటినవ్వు, కనుముక్కు తీరూవున్న పిల్ల లోకమంతా గాలించినా దొరకదు మెవరికి" అన్నాడు.

శేఖరు తలవూగిస్తూ నవ్వుముఖంతో బైటికి వెళ్ళిపోయాడు. ఈ కుర్రవాడికి ఇరవై అయిదు, ఇరవై ఆరేళ్ళుంటాయి. ఎమ్. ఏ. ప్యాసయి, ఇన్నాళ్ళనుంచీ ఎప్రెంటిస్, చేస్తూ నిరుడే "ఎటర్నీ" అయినాడు. అతడితండ్రి నవీన్ రాయ్, బెల్లపు వ్యాపారంచేసి లక్షాధికారి అయాడు. కొద్ది సంవత్సరాలక్రితమే ఆ వ్యాపారం మానేసి ఇంట్లోనే కూర్చుని వడ్డీ వ్యాపారం చేస్తున్నాడు. పెద్దకొడుకు అవినాసుడు వకీలు– చిన్నకొడుకు ఈ శేఖర్ నాథుడు. సిటీమధ్యలో వాళ్ళకు ఓ మూడంతస్తుల మేడ వుంది. వీళ్ళ డాబాతో గురుచరణుడు గారి డాబా కలిసి వుండటం మూలంగా ఈ ఉభయకుటుంబాలకూ అంత సన్నిహితత్వం వుంది. ఇంట్లో ఆడపిల్లలందరూ యీ డాబామీదనుంచే వస్తూ పోతూ వుంటారు.

౨

శ్యాంబజారులో ఒక శ్రీమంతుల యింటి బిడ్డతో శేఖరుడి పెళ్ళి విషయమై సంప్రతింపులు చాలా రోజులనుంచి జరుగుతున్నాయి. వాళ్ళు ఆరోజున వచ్చి పెళ్ళికొడుకుని చూసుకొని, వచ్చే మాఘమాసంలో ముహూర్తం పెట్టుకోవాలని ఉద్దేశం. కాని శేఖరుడి తల్లి అందుకు ఒప్పుకోలేదు. పుత్రుడు స్వయంగా వెళ్ళి పిల్లను చూసుకుని ఇష్టపడ్డాక కాని నిశ్చయం చేసుకోవడానికి వీల్లేదని దాసీదాని ద్వారా వారి దగ్గరకు కబురు పంపింది.

నవీనరాయ్ దృష్టి కేవలం డబ్బుమీదనే వుంది. గృహిణి యిలా అభ్యంతరం చెప్పటంతో ఆయన కోపం తెచ్చుకుని "మళ్ళీ అదేం మాట? పిల్ల ఇదివరకు చూసినదేగా! ముందు నిశ్చయం అని అనుకుంటే తర్వాత మంచి రోజు చూసుకుని తాంబూలాలు పుచ్చుకునేప్పుడు మళ్ళీ చూసుకోవచ్చు" అన్నాడు.

అయినా గృహిణి ఒప్పుకోలేదందుకు. ఏమాట తేల్చి చెప్పనూ లేదు. ఆ రోజున కోపం వచ్చి ఎప్పుడో ఒంటి గంట అయ్యాక భోంచేసి, వీధి గదిలోకి వెళ్ళి పడకేశాడు ఆయన.

శేఖర్‌నాథ్ కొంచెం విలాస పురుషుడు. మూడో అంతస్థులో అతడు వుండే గది ముచ్చటగా అలంకరించి వుంటుంది. అయిదారు రోజులు గడిచాక ఒకనాడు మధ్యాహ్నం అతడు నిలువుటద్దం ముందర నిలబడి—పిల్లను చూసి రావటానికై వెళ్ళటానికి ముస్తాబవుతున్నాడు. అప్పుడే లలిత వచ్చింది గదిలోకి. ఒక్క క్షణం చూస్తూ మెదలకుండా వూరుకుని 'పిల్లను చూసి రావటానికి వెళుతున్నావల్లే వుందే! కదూ?" అని అడిగింది

శేఖర్ వెనక్కి తిరిగి చూసి, 'ఏదీ ఎలా వుంటే పెళ్ళికూతురికి నచ్చుతుందో—అలా ముస్తాబు చేద్దూ నన్ను!' అని అడిగాడు.

లలిత నవ్వింది. 'ఇప్పుడు నాకు తీరిక లేదు. శేఖరుదా! నేను డబ్బు తీసుకుందామని వచ్చాను' అంటూ దిండుకింద వున్న తాళాలు తీసుకుని, బీరువా తెరచి కొన్ని రూపాయలు లెక్క పెట్టి తీసుకుని చెంగున ముడేసుకుని—'డబ్బు అయితే

అవసరము వచ్చినప్పుడల్లా తీసుకెళుతున్నా, కాని యిదంతా తీరేదెలాగో !' అని తనలో తాను అనుకున్నట్లుగా అంది.

శేఖర్ బ్రష్‌తో క్రాఫ్ ఎగదువ్వుకుంటూ 'అదే తీరుతుంది' అన్నాడు.

లలిత ఆ మాటలోని అంతరార్థం గ్రహించలేదు. చూస్తూ వూరుకుంది.

'అలా చూస్తూ ఊరుకున్నావు, అర్థంకాలేదా ?' అన్నాడు శేఖర్.

లలిత తలతిప్పుతూ 'ఊహుఁ' అంది 'ఇంకొంచెం పెద్దదానివి అయాక అప్పుడు అర్థమవుతుందిలే' అంటూ శేఖర్ బూట్లు తొడుక్కుని వీధిలోకి వెళ్ళిపోయాడు.

... ... ... ...

రాత్రి శేఖర్ సోఫాలో పడుకునివుండగా తల్లి వచ్చింది గదిలోకి, ఆమె వచ్చేసరికి అతడు చటుక్కున లేచి కూర్చున్నాడు. తల్లి ఒక కుర్చీమీద కూర్చుని 'పిల్లను చూసివచ్చావుగా యెలావుందిరా ?'

శేఖర్ తల్లి ముఖంకేసి చూసి నవ్వుతూ 'భేషుగ్గా వుంది' అన్నాడు.

శేఖరుడి తల్లి పేరు భువనేశ్వరి. ఆవిడికి ఇంచు మించు యాభై యేళ్లుంటాయి. కాని శరీర సౌష్ఠవం చూస్తేమాత్రం ముప్పైఅయిదు, ముప్పైఆరేళ్ళకు యెక్కువ వుండవేమో అనిపిస్తుంది. ఈ సుందరాకారంలో యిమిడివున్న ఆ మాతృహృదయం మరింత సున్నితమైనదీ కోమలమైనదీను. ఆమె పల్లెటి దిక్కుమనిషి, పల్లెటూళ్లోపుట్టి పల్లెటూళ్లోనే పెరిగినమాట

వాస్తవమే, కాని ఆమె యెన్నడూ బస్తీనుర్యాదలు తెలియని మనిషిలా కన్పించదు. పట్నవాసపు ఆచార వ్యవహారాలు ఆ మనుకుతనం సులభంగా యెలా అలవాటు చేసుకుందో, అలాగే జన్మభూమి తాలూకు మాధుర్యాన్ని సరళత్వాన్ని కూడా పోగొట్టుకోకుండా నిలుపుకుంది. ఇలాంటి తల్లి అంటే శేఖర్‌కు యెంత అభిమానమో, ఆమెకుకూడా తెలియదు. జగదీశ్వరుడు శేఖర్‌కు ఎన్నోయిచ్చాడు. అనన్య సాధారణమైన సౌందర్యమూ, ఆరోగ్యమూ, ఐశ్వర్యమూ తెలివితేటలూ. కాని ఇలాంటి తల్లికి కొడుకయిన భాగ్యంవుందే అది అన్నిటికన్నా గొప్పది అని అనుకుంటాడతడు.

'భేషుగ్గా వుంది అని వూరుకున్నావేమిరా?' అంది తల్లి.

శేఖర్ మళ్ళీ నవ్వుతూ తలవంచుకొని 'నువ్వు యేదయితే అడిగావో దానికే సమాధానం చెప్పాను నేను' అన్నాడు.

తల్లికూడా నవ్వింది. 'ఏదీ ఎక్కడ చెప్పావు! రంగు యెలావుంటుంది పసిమేనా? ఎవరిలాగా వుంటుంది! మన లలితలా వుంటుందా?' అని అడిగింది.

శేఖరుడు తలపైకెత్తి 'లలిత నలుపు అమ్మ! ఆమె కన్న తెలుపే!' అన్నాడు.

'కళ్ళూ ముఖం ఎలావుంటాయి!'

'అవి బాగానేవుంటాయి'

'అయితే మీ నాన్నగారితో చెప్పనా?'

ఈ మాటకు శేఖరుడు మెదలకుండా వూరుకున్నాడు.

తల్లి కొడుకు ముఖంకేసి కాస్సేపు చూస్తూ వూరుకుని హఠాత్తుగా ! 'అవునురా ! ఇన్నాళ్లు పిల్ల యేమయినా చదువుతుందా ?' అని అడిగింది

'ఆ మాట అడగలేదమ్మా నేను' అన్నాడు శేఖర్.

తల్లి అతివిస్మితురాలై 'అడగక పోవటమేమిట్రా ! పోగా ఈ రోజుల్లో మీకు అన్నిటికన్న ముఖ్యవిషయం ! అదే అతెలుసుకోకుండా వచ్చావా ?' అని అడిగింది.

శేఖరుడు నవ్వుతూ 'లేదమ్మా ! ఆ సంగతి నాకు జ్ఞాపకమే లేదు అప్పుడు' అన్నాడు.

కొడుకుమాటలు విని ఈసారి ఆమె మరీ విస్మితురాలై ఒక్కక్షణం అతడి ముఖంకేసి చూస్తూ ఊరుకుని, నవ్వుతూ 'అయితే నువ్వు ఆ పిల్లని చేసుకోవటంలేదులేవుందే చూస్తే !' అంది.

శేఖరుడు ఏదో చెప్పబోయాడు, కాని ఇంతలో లలిత గదిలోకి రావటంతో ఆమెనుచూసి మెదలకుండా వూరుకున్నాడు. లలిత మెల్లిగావచ్చి భువనేశ్వరి వెనకాల నుంచుంది. ఆమె కుడిచేత్తో లలితను ముందరకు తీసుకుని 'ఏమిటమ్మా ?' అని అడిగింది.

లలిత మెల్లగా "ఏమీ లేదు అమ్మా !" అంది. లలిత ఇదివరకు ఆమెను పిన్ని అని పిలిచేది. ఆమె అలా పిలవనక్కరలేదు అని వారించి "నీకు నేను పిన్నినికాదు లలితా ! తల్లిని" అంది. అప్పటినుంచీ అలాగే పిలుస్తోంది. భువనేశ్వరి ఆమెను గుండెకు మరింత దగ్గరగా హత్తుకుని సాదరంగా "ఏమీ లేదూ !

అయితే నన్ను ఊరికే ఒకసారి చూసిపోదామని వచ్చానన్న మాట" అంది.

లలిత మెదలకుండా వూరుకుంది.

"చూడటానికయితే నచ్చింది. కాని వంట యెప్పుడు చేస్తుందినరి?" అన్నాడు శేఖరుడు.

"ఇది వంటచేయటం దేనికిరా?" అంది తల్లి. శేఖరుడు ఆశ్చర్యపోతూ "అయితే మరి వాళ్ళకి వంట ఎవరు చేస్తారమ్మా? వాళ్ళ మామకూడా లలితే వంటా పనులూ, అన్నీ చేస్తోందని అన్నాడుగా ఆరోజున" అన్నాడు.

తల్లి నవ్వింది. "వాళ్ళమామయ్య అంతేలే. ఏదో ఒకటి అలాగే అంటూవుంటాడు. దానికి పెళ్ళికాలేదు కదా, అది వంటచేస్తే ఎవరు భోంచేస్తారు?

మన వంట బ్రాహ్మణుణ్ణి పంపించా. అతడే చేస్తాడు. మన యింట్లో వంట పెద్దమ్మ చేస్తోంది. నేను రెండుపూటలా వాళ్ళ యింటికి వెళ్ళి భోంచేసివస్తున్నా" అంది.

తనతల్లి ఈ పేదకుటుంబం తాలూకు భారాన్ని వహించిందని శేఖరుడు గ్రహించాడు. తృప్తిగా ఒక నిట్టూర్పువిడిచి మెదలకుండా వూరుకున్నాడు.

ఒక నెల గడిచిపోయాక ఒకరోజున సాయంకాలం శేఖరుడు సోఫాలో కూర్చుని ఏదో ఇంగ్లీషు నవల చదువుకుంటున్నాడు తన్మయుడై. ఆ సమయంలో లలిత గదిలోకివచ్చి తలగడాక్రిందనుంచి తాళపుచెవులు తీసుకుని గలగలలాడిస్తూ బీరువా తలుపు తెరిచింది. శేఖరుడు పుస్తకంమీదనుంచి తల పైకెత్తకుండానే "ఏమిటి?" అని అడిగాడు.

"డబ్బు తీసుకుంటున్నాను" అన్నది లలిత. "హుఁ" అని శేఖరుడు మళ్ళీ చదువుకోవటం మొదలెట్టాడు. లలిత డబ్బు కొంగున మూటకట్టుకుని నిలబడింది. ఆమె యివాళ చక్కగా అలంకరించుకుని వచ్చింది. శేఖరుడు తనని చూడాలని ఆమె అభిలాష. "పదిరూపాయలు తీసుకున్నాను శేఖర్ దా!" అంది.

"సరేలే" అన్నాడు శేఖరుడు. కాని తలెత్తి చూడలేదు. గత్యంతరంలేక ఆమె అటూ యిటూ తాగట్లాడుతూ ఆలస్యంచేస్తోంది. కాని ఫలితం కనిపించలా. అప్పుడిహ మెల్లిగా బైటికి వెళ్ళిపోయింది. వెళ్ళిందన్న మాటేకాని తిన్నగా వెళ్ళిపోలేక పోయింది. మళ్ళీ వెనక్కి తిరిగివచ్చి తలుపుచాటున నిలబడింది. ఆమె యివాళ నాటకానికి వెళ్ళాలి.

శేఖరుడి అనుజ్ఞ లేకుండా తాను యెక్కడికి వెళ్ళలేనని తెలుసామెకు అలా వెళ్ళకూడదని ఆమెకు యెవ్వరూ చెప్పనూ లేదు. ఎంచేత వెళ్ళకూడదు. వెడితేయేం అన్న కుశ్శంకలు కూడా ఆమె మనస్సు కెన్నడూ కలగలేదు. కాని జన్మతః వచ్చే తెలివితేటలు ఏవయితే వున్నాయో, వాటివల్లనే నేర్చుకుందాసంగతి. ఇతరులు ఎక్కడికి వెళ్ళాలనుకుంటే అక్కడకు వెళ్ళిపోగలరు సరదాగా. కాని ఆమె వెళ్ళలేదు. ఆమె స్వతంత్రురాలుకాదు. మామా అత్తా అనుమతి యిచ్చినంత మాత్రాన చాలదు ఆమెకు.

ఆమె తలుపుచాటునే నుంచుని మెల్లిగా "మేము నాటకం చూట్టానికి వెడుతున్నాం" అంది.

ఆమె మృదువైన కంఠస్వరం శేఖరుడి చెవిని పడలేదు అతడు జవాబు చెప్పలేదు.

లలిత అప్పుడు గొంతు ఇంకొంచెం పెద్దదిచేసి,

"అందరూ నాకోసం నుంచునివున్నారు" అంది.

ఈ మాట శేఖరుడికి వినిపించింది. పుస్తకం ఒకప్రక్క పెట్టి "ఏమిటే?" అని అడిగాడు

లలిత కొంచెం వుక్రోషంతో "ఇప్పటికి వినపడిందన్న మాట! మేము నాటకానికి వెళుతున్నాం" అంది.

"మేమంటే ఎవరెవరు?" అని అడిగాడు శేఖరుడు.

"నేను, అన్నాకాళీ, చారుబాలా, వాళ్ల మామయ్యా"

"మామయ్య ఎవరు?"

ఆయనపేరు గిరీన్ బాబు. ముంగేరునుంచి ఇక్కడకు వచ్చి అయిదారు రోజులయింది. ఇక్కడే బి. ఏ. చదువుతాడు భలేవాడాయన"

"ఓం! పేరూ, ఊరూ, ఏంచేస్తున్నదీ - సంభాషణ చాలా జరిగిందల్లే వుంది. అందుకనేనా నాలుగు రోజులనుంచీ ఎక్కడా కంటికి కన్పించటం లేదు! పేకాట ఆడుతున్నా రను కుంటా"

హఠాత్తుగా శేఖరుడు మాట్లాడే ఈ ధోరణిచూసి లలిత భయపడింది. ఇలాంటి ప్రశ్నలు బయలుదేరుతాయని ఆమె ఎన్నడూ వూహించనుకూడా లేదు. అంచేత మెదల కుండా వూరుకుంది.

"ఇన్నాళ్ళనుంచీ పేకాట జోరుగా సాగుతోందికదూ!"

లలిత గుటకమింగి మృదు స్వరంతో "చారు చెప్పింబా మేం?" అంది.

"చారు చెప్పిందా ? ఏం చెప్పిందీ?" అంటూ శేఖరుడు తలపైకెత్తి ఆమె వంక చూసి "ఏకంగా చీర అదీ కట్టుకుని రెడీగా వచ్చావుగా!—సర్లే, వెళ్ళు."

లలిత వెళ్ళలేక పోయింది. మెదలకుండా అక్కడే నుంచునివుంది.

ప్రక్కయింటి చారుబాల లలితకు సమవయస్కురాలు, స్నేహితురాలు. వాళ్లు బ్రాహ్మ మతస్తులు. శేఖరుడు ఈ గిరీన్‌నుతప్ప వాళ్ళనందర్నీ యెరుగు. గిరీన్ అయిదారేళ్ళక్రితం యెప్పుడో ఒకసారి ఈ వూరు వొచ్చాడు. ఇన్నాళ్ళనుంచీ బంకింపూర్‌లో చదువుతున్నాడు. కలకత్తా రావలసిన అవసరమూ కలగలేదు. రానూ లేదతడు. అంచేత శేఖరుడతన్ని యెరగడు. లలిత ఇంకా అలాగే నుంచుని వుండటంచూసి, "ఊరికే ఎందుకలా నుంచున్నావ్? వెళ్ళు" అని మళ్ళీ పుస్తకం తీసుకుని ముఖానికి అడ్డంగా పెట్టుకున్నాడు.

అయిదు నిమిషాలు అలా మెదలకుండా నుంచున్నాక లలిత మళ్ళీ మెల్లిగా "వెళ్ళనా?" అని అడిగింది.

"వెళ్ళమని చెప్పాగా లలితా."

శేఖరుడి ధోరణిచూసేసరికి లలితకు నాటకం చూడామన్న కోరిక నశించింది. కాని ఆమె వెళ్లకుండా వుండడానికీల్లేదు.

ఆమె సగం ఖర్చు పెట్టేటట్టు, సగం ఖర్చు చారుబాల మామ పెట్టేటట్టూ అని అదివరకే నిశ్చయించుకున్నారు.

చారూ-వాళ్ళూ అందరూ ఆమెకోసం ఎదురుచూస్తూ వుంటారు. ఇక్కడ ఆలస్యమయిన కొద్దీ వాళ్ళను అక్కడ ఆదుర్దా ఎక్కువవుతూ వుంటుంది. ఈ విషయం ఆమెకు స్పష్టంగా తెలిసినా ఏంచేయాలో ఉపాయం తోచటంలేదు. అనుమతి లేకుండా వెళ్ళేటంత సాహసం లేదామెకు. మళ్ళీ రెండు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాక "ఇవాళ ఒక్కరోజుకే వెళ్ళనా?" అని అడిగింది లలిత.

శేఖరుడు పుస్తకం ఒక ప్రక్కకు విసిరేసి "నన్ను విసిగించకు లలితా! వెళ్ళాలని ఇష్టమైతే వెళ్ళు. మంచీ, చెడూ గ్రహించే వయస్సు వచ్చింది నీకు" అని గద్దించాడు.

లలిత త్రుళ్ళిపడింది. శేఖరుని దగ్గిర చివాట్లు తినటం తనకేమీ కొత్తకాదు అలవాటయింది. కాని రెండు మూడేళ్ళ మధ్య యెప్పుడూ ఇలా మాట్లాడగా వినలా. అక్కడ చారూవాళ్ళూ వాళ్ళంతా ఎదురుచూస్తున్నారు. ఈలోపుగా డబ్బుతీసుకోటానికి ఇక్కడకు వచ్చేసరికి ఈ చిక్కు వచ్చి పడింది. ఇప్పుడు వాళ్ళ దగ్గరకు వెళ్ళి మాత్రం యేమని చెబుతుంది!

ఎక్కడకయినా వెళ్ళటం విషయంలో ఇప్పటివరకూ శేఖరుడు తనకు పూర్తి స్వాతంత్ర్యం యిచ్చాడు. ఆ ధైర్యంతోనే ఏకంగా గడ్డంగా అవీ మార్చుకుని, తయారై వచ్చింది. ఆ స్వాతంత్ర్యం ఇప్పుడిలా లోపించి పోవటమేకాదు, అది ఎందుచేత ఇలా అయిందో, ఆ కారణం ఎంత సిగ్గుపడవలసిన కారణమో ఈ పదమూడో యేట మొదటిసారిగా గ్రహించి లలిత లోపలలోపల కుమిలిపోయింది. అభిమానంతో కళ్ళనిళ్ళు

పెట్టుకుని మరో అయిదు నిమిషాలు నిశ్శబ్దంగా అలాగే నుంచుని కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయింది. తన గదిలోకి వెళ్ళి దాసీదానితో అన్నాకాళీని పిలిపించి ఆ పిల్లదాని చేతికో పదిరూపాయలూ ఇచ్చి "ఇవాళను మీరంతా వెళ్ళండి కాళీ! నాకు వంట్లో యేమీ బాగాలేదు. నేను రాలేనని చెప్పు వాళ్ళందరితో" అంది.

"బాగుండక పోవటమేమిటి లలితా?" అని అడిగింది అన్నాకాళీ.

"తలనొప్పిగా వుంది. వళ్ళంతా విరగగొట్టినట్లు నొప్పులుగా వుంది. చాలా అస్వస్థతగా వుంది" అంటూ పక్కమీదికి వచ్చి పడుకుంది తర్వాత చారు వచ్చి బ్రతిమాలింది. బలవంతం చేసింది అత్తద్వారా సిఫార్సు చేయించింది. కాని ఏమయినా లలిత మాత్రం ఇష్టపడ లేదు. అన్నాకాళీ చేతిలో పది రూపాయలూ పడేసరికి ఎప్పుడు వెడదామా అని తొందరపడ సాగింది. ఈ గందరగోళంలో అసలు వెళ్ళటమే పడదేమోనని ఆమె చారును చాటుగా పిలిచి "లలితకు అస్వస్థతగా వుండటం మూలంగా రానని చెప్పింది చారూ! నాచేతికి డబ్బు యిచ్చింది. ఇదిగో చూడు మనమంతా వెడదాం" అంది. అన్నాకాళీ వయస్సులో చిన్నదైనా తెలివితేటల్లో ఎవరికీ తీసిపోయేది కాదు అనుకుంటోంది చారుబాల. ఆమె అందుకు యిష్టపడి ఆపిల్లదాన్ని వెంటపెట్టుకుని వెళ్ళిపోయింది.

చారుబాల తల్లి మనోరమకు పేకాటకన్న ప్రియమైన వస్తువు మరొకటిలేదు ప్రపంచంలో. ఆటమీద ఆపేక్ష [illegible]

వున్నా, దానికి తగిన నేర్పు లేదామెకు. ఆమె ఆటలోని లోటుపాట్లు సరిపుచ్చుకోటానికి లలితను పట్టుకునేది. లలిత చాలా బాగా ఆడగలదు. మనోరమ పినతల్లికొడుకు గిరీన్ వచ్చి నప్పటినుంచీ మధ్యాహ్నమప్పుడు వారియింట్లో పేకాట జోరు గానే సాగుతోంది. గిరీన్ మగవాడు—బాగా ఆడేవాడు. అంచేత అతడికి ప్రతిపక్షంలో కూర్చోపెట్టటానికి మనోరమ లలితను పట్టుకునేది.

నాటకంరోజు మర్నాడు మామూలు వేళకు లలిత రాక పోయేసరికి మనోరమ దాసీదాన్ని పంపింది. లలిత అప్పుడు ఓ పెద్ద ఇంగ్లీషు నవలను బెంగాలీలోకి తర్జుమా చేస్తోంది. వెళ్లలేదు.

ఆమె స్నేహితురాలు వచ్చి కూడా ఆమెను కదిలించ లేక పోయింది. అప్పుడు మనోరమే స్వయంగా వచ్చి ఆమె చేతిలోని పుస్తకం తీసి ఒకవైపున పడేసి, "లే, చదివీ చదివి నువ్వు మహా జడ్జీపని చెయ్యబోవటం లేదులే పేక ఆడుదువు గాని రా" అంది.

లలిత మనస్సులో చాలా చిక్కునపడి కళ్లనీళ్లపర్యం తమై ఇవాళ రానటానికి తనకేమాత్రం వీలులేదని, రేపు వస్తా నని చెప్పింది. మనోరమ వినిపించుకోలేదు. చివరికివాళ్ల అత్త చేత చెప్పించి లలితను తీసుకుని వెళ్లింది. అంచేత ఆమె ఇవాళకూడా గిరీనుకు ప్రతికక్షిగా ఆడవలసి వచ్చింది. కాని ఆటమాత్రం బావుండలా. ఆమెను అసలు ఆటమీద లేనేలేదు మనస్సు కూర్చున్నంతసేపూ ఏదో తప్పని సరిగా కూర్చుని మామూలు వేళకు లేచి వెళ్లిపోయింది. వెళ్లబోయే ముందు

"రాత్రి నిరాగు డబ్బు అంగుతే పంపారు కాని మేము నాటకానికి వెళ్ళలేక. రేపు రండి. వెళదాం" అన్నాడు గిరీన్.

లలిత తల త్రిప్పుతూ "ఊహు, నాకు చాలా జబ్బు చేసింది" అంది.

గిరీన్ నవ్వుతూ "ఇప్పుడు నయమయిందిగా. రేపు వెళదాం" అన్నాడు.

"ఊహుఁ, నాకు అసలు తీరుబడే వుండదు" అని గబగబా అక్కడి నుంచి వెళ్ళిపోయింది లలిత. ఇవాళ ఆమెకు ఆటమీద మనస్సు లేక పోవటానికి కేవలం శేఖరుడి భయమే కారణం అనటానికి వీల్లేదు. ఆమెకు సహజంగా చాలా సిగ్గు కూడా కలిగింది.

శేఖరుడి ఇంటికి రాగానే ఈ యింటికే చిన్నప్పటినుంచీ రావటం పోవటం అలవాటుంది ఆమెకు. ఇంట్లో వాళ్ళ ముందర లాగానే వీళ్ళ అందరి ముందూ కూడా నిస్సంకోచంగా తిరుగుతూ వుండేది. అలాగే చారుబాల మామ ముందర కూడా తిరగటానికీ, మాట్లాడటానికీ మొదట్లో ఆమెకు ఏలాంటి సంకోచమూ కలుగలేదు కాని యివాళ గిరీన్ యెదుట కూర్చుని ఆడుతున్నంత సేపూ ఆమె మనస్సు ఏలాగో వుంది. ఈ కొద్దిరోజుల పరిచయానికే గిరీన్ తనని ప్రేమదృష్టితో చూస్తూన్నాడని ఆమెకు తోచింది. పురుషుడి ప్రేమదృష్టి ఇంత లజ్జాకరమైందని ఇంతకుపూర్వ మెన్నడూ ఆమె ఊహించి కూడా యెరుగదు.

ఒకసారి ఇంట్లోకి వెళ్ళి కన్పించి శేఖరుడి గదిలోకి వెళ్ళి ఆపని ఈపని చేయసాగింది. చిన్నప్పటినుంచీ ఈ గదిలో పను

లన్నీ ఆమే చేస్తూవుండేది, పుస్తకాలన్నీ చక్కగా అమర్చటం, టేబిల్ సర్దడం, కలం-సిరాబుడ్డి తుడిచి శుభ్రంగా వుంచటం ఇలాంటివన్నీ ఆమె చెయ్యకపోతే ఇంకెవ్వరూ చేసేవారు లేరు. నాలుగయిదు రోజులు అశ్రద్ధ చేసేసరికి అన్నిపనులూ అలాగే వుండిపోయాయి. ఈ లోటుపాట్లన్నీ శేఖరుడు రావటానికి పూర్వమే పూర్తిచేద్దామని నడుంకట్టుకుని ప్రారంభించింది.

లలిత తీరుబడిగా వున్నప్పుడల్లా ఈ ఇంట్లోనే వుండటం మూలంగా ఎవరినీ పరాయివాళ్ళనుగా భావించేది కాదు. అలాగే ఆ ఇంట్లోవాళ్ళెవరూ ఆమెనూ పరాయిదాన్నిగా భావించేవాళ్ళు కారు. ఎనిమిదో యేట తల్లి-దండ్రులను పోగొట్టుకుని మేనమామ యింటికి వచ్చింది. అప్పటినుంచీ చెల్లెలిలాగా శేఖరుడివెంట తిరుగుతూ చదువు నేర్చుకుని ఈమాత్రపు మనిషయింది.

ఈమె శేఖరుడికి చాలా అభిమానపాత్ర అని అందరూ యెరుగుదురు. కాని ఆ అభిమానం యెప్పుడు-యెందుకు ఎలా ఏర్పడిందో మాత్రం యెవ్వరూ యెరుగరు. అంతేకాదు-లలిత కూడా యెరుగదు. చిన్నప్పటినుంచీ ఒకే భావంతో శేఖరుడు ఆమెయందు ఎంతో ఆదరం కనపరచటం అందరికీ తెలుసు. అది ఇప్పటివరకూ యెవ్వరికీ యెబ్బెట్టుగా కనపడలేదు; ఎవ్వరి దృష్టినీ ఆకర్షించలేదు కూడా. ఈమె యెప్పటికయినా ఈ యింటికి కోడలుగా రాగలదేమో అన్న భావనకూడా ఎవ్వరికీ కలుగలేదు. లలిత యింట్లోవాళ్ళకికూడా కలుగలేదు ఆ భావన. భువనేశ్వరికూడా అనుకోలేదు.

పనిఅంతా పూర్తిచేసి శేఖరుడు రాకముందే ఆ గది లోంచి వెళ్ళిపోవాలని అనుకుంది లలిత. కాని పరధ్యానంగా వుండి గడియారంకేసి చూడలేదు. హఠాత్తుగా గుమ్మంలోనుంచి బూట్లచప్పుడు విని ముఖం పైకెత్తి ప్రక్కగా తప్పుకొని నిలబడింది.

శేఖరుడు గదిలోకి వస్తూనే "నిన్న యింటికి తిరిగివచ్చేసరికి రాత్రి యెంత ప్రొద్దుపోయిందేమిటి?" అని అడిగాడు.

లలిత జవాబివ్వలేదు.

శేఖరుడు యీజీచైరులో చేరగిలపడి "ఎప్పుడు తిరిగి వచ్చావ్? రెండింటికా? నోట్లోంచి మాట రావటం లేదెందుకని?" అన్నాడు.

లలిత మెదలకుండా అలాగే నుంచుని వుంది.

శేఖరుడు విసుగొచ్చి "క్రిందికి వెళ్ళు అమ్మ పిలుస్తోంది" అన్నాడు.

భువనేశ్వరి భాండార గృహంముందు కూర్చుని పళ్ళెంలో అల్పాహారాలు పెడుతోంది. లలిత దగ్గరకువచ్చి "పిలిచావా అమ్మా?" అని అడిగింది

"ఏదీ? పిలవలేదే!" అంటూ ఆమె తల పైకెత్తి లలిత ముఖం చూస్తూనే "ముఖమంతా ఇలా వాడిపోయిందేం లలితా? ఇంతవరకు యేమీ తినలేదల్లేవుందే!" అని అడిగింది.

లలిత తల త్రిప్పింది.

"సరే. వెళ్ళి ఈ ఫలాహారం మీ శేఖర్ దాదా కిచ్చి వచ్చునరా" అన్నది భువనేశ్వరి.

లలిత ఆ పళ్లెం చేతపుచ్చుకుని ఒక్క క్షణం ఆగి మేజా మీదగా వచ్చింది. శేఖరుడు అప్పటికి ఇంకా కళ్లుమూసుకొని ఆరాం కుర్చీలో జేరగిలపడి వున్నాడు. ఆఫీసు దుస్తులుకూడా మార్చలేదు. చేతులూ ముఖంకూడా కడుక్కోలేదు. లలిత మెల్లిగా దగ్గరకువచ్చి "ఫలహారం తీసుకువచ్చాను" అంది.

శేఖరుడు కళ్ళు తెరవకుండానే "అక్కడెక్కడయినా పెట్టివెళ్ళు" అన్నాడు.

లలిత పెట్టలేదు. అలాగే పుచ్చుకుని మెదలకుండా నుంచుని వుంది.

శేఖరుడు కళ్ళు తెరచి చూడకుండానే లలిత వెళ్ళకుండా అక్కడేనుంచుని వున్నదని గ్రహించాడు. రెండుమూడు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాక "ఎంతసేపని నుంచుంటావు లలితా? నాకింకా ఆలస్యంవుంది. అక్కడ పెట్టి, క్రిందికి వెళ్ళు" అన్నాడు.

లలితకు మనస్సులో కోపంవచ్చినా మెదలకుండా అలాగే నుంచుని మెల్లిగా "ఉంటే ఉంది ఆలస్యం. నాకూ క్రింద ముంచుకుపోయే పనేమీ లేదు" అన్నది.

శేఖరుడు కళ్లు తెరచి నవ్వుతూ "ఏదీ—మాట వచ్చిందే! క్రింద పని లేకపోతే పోనీ, ఆ ఇంట్లో లేదూ? ఆ ఇంట్లోనూ లేకపోతే ఆ ప్రక్క యింట్లోనయినా లేకపోతుందా? నీకు ఒక్కయిల్లే కాదుగా లలితా!" అన్నాడు.

"కాదూ?" అంటూ లలిత కోపం తెచ్చుకుని ఆ పళ్లెం తశ్తీనుని టేబిల్ మీద పెట్టి గబగబా వెళ్ళిపోయింది అక్కడి నుంచి.

"సాయంకాలం ఓసారి రా" అని కేకేశాడు శేఖరుడు.

"వందసార్లు నేను పైకీ క్రిందికీ రాలేను" అంటూ లలిత వెళ్ళిపోయింది.

క్రిందికి రాగానే శేఖరుడి తల్లి "ఫలహారమయితే ఇచ్చి వచ్చావు కాని, మీ అన్నకు తాంబూలం ఇచ్చిరాలేదేమే!" అని అడిగింది.

"నాకు ఆకలేస్తోందమ్మా! ఇంక నేను పోలేను, ఇంకెవరినయినా యిచ్చి పంపు" అంటూ లలిత చతికిలపడింది.

ఆమె కోపంగా వున్న లలిత ముఖంకేసి చూసి నవ్వుకుని "సరే, నువ్వు కూర్చో. దాసీదాని చేతికిచ్చి పంపుతాలే" అన్నది.

లలిత జవాబు చెప్పకుండా ఫలహారం ముందర కూర్చుంది.

తాను నాటకానికి వెళ్ళలేను. అయినా శేఖరుడు 'తననెందుకు కూడా తెమ్మన్నాడో?' అన్న కోపంతో లలిత నాలుగైదు రోజులు శేఖరుడికి కనపడలేదు. అయినా అతను ఆఫీసుకు వెళ్ళాక మధ్యాహ్నమప్పుడు అతని గదిలోకి వెళ్ళి పనులు చేస్తూ వుండేది. శేఖరుడు తన తొందరపాటును గ్రహించి రెండుసార్లు కబురు చేశాడు. అయినా ఆమె రాలేదు.

౪

ఆ వీధికి అప్పుడప్పుడు ఒక ముసలివాడు బిచ్చానికి వస్తూవుండేవాడు. అతడంటే లలితకు చాలా దయ. వచ్చినప్పుడల్లా అతడికో రూపాయి ఇస్తూ వుండేది. రూపాయి చేతిలో పడగానే అతడు అపూర్వమూ, అసంభవమూ అయిన ఆశీస్సులు పలుకుతూవుండేవాడు. అవన్నీ వినటం లలితకు సరదాగా ఉండేది. లలిత పూర్వజన్మలో అతడి తల్లిట! ఆ సంగతి అతడు చూడగానే కనిపెట్టాడట! ఆ ముసలిబిడ్డ ఇవాళ ప్రొద్దున్నే గుమ్మంలోకి వచ్చి "మా తల్లి ఎక్కడుంది?" అని పిలిచాడు.

సంతానం పిలుపువిని లలిత ఇవాళ కొంచెం కంగారు పడింది. శేఖరుడు ఇంకా యింట్లోనే వున్నాడు రూపాయి ఎలా వసుంది? ఇటూ అటూ చూసి, అత్తదగ్గరకు వెళ్ళింది. అత్త ఇప్పుడే దాసీదానితో పోట్లాడి, కోపంతో పోయి, పొయ్యిదగ్గర కూర్చుంది. ఆమెను యేమీ అడగలేక మళ్ళీ వెనక్కి తిరిగివచ్చి చూసింది. ఆ బిచ్చగాడు కర్ర గోడకానించి చతికిలపడి కూర్చున్నాడు. ఇంతకుపూర్వ మెప్పుడూ లలిత అతడికి నిరాశ కలిగించలేదు. ఇవాళ వట్టిచేతుల్తో పంపటానికి ఆమెకు మనస్కరించలేదు.

బిచ్చగాడు మళ్ళీ పిలిచాడు.

"అన్నాకాళి పరుగెత్తుకుంటూ వచ్చి, "మీ అబ్బాయి వచ్చాడు వదినా!" అంది.

"కాళీ, ఒక్కపని చేసిపెట్టమ్మా! శేఖరదా దగ్గరకెళ్ళి ఒక రూపాయి తెచ్చిపెట్టమ్మా!" అన్నది లలిత.

అన్నా కాళీ పరుగెత్తుకుంటూ పోయింది. కాస్సేపట్లో మళ్ళీ అలాగే పరుగెత్తుకుంటూ వచ్చి లలిత చేతిలో రూపాయి పడేస్తూ "ఇదిగో, తీసుకో!" అన్నది.

"శేఖర్‌దా ఏమన్నాడు?" అని అడిగింది లలిత.

"ఏమీ అనలా. చిలక్కొయ్యను వున్న చొక్కా జేబులో వుంది తీసికెళ్ళమన్నాడు."

"ఇంకేమీ అనలేదా?"

"లేదు, ఇంకేమీ అనలేదు" అని తలత్రిప్పి ఆడుకోటానికి వెళ్ళిపోయింది.

లలిత భిక్షుకుని పంపివేసింది. కాని ఇతర రోజుల్లోలాగా అక్కడ నుంచుని అతడి ఆశీస్సులు వినలేకపోయింది.

ఈమధ్య కొన్నాళ్ళనుంచీ పేకాట బాగా సాగుతోంది. ఇవాళ మధ్యాహ్నం లలిత వెళ్ళలేదు. తలనొప్పిగా వుందని చెప్పి పడుకుంది. ఇవాళ నిజంగా ఆమె మనస్సంతా వికలమై పోయింది. సాయంకాలం కాళీని పిలిచి "కాళీ, నువ్వు శేఖరదా దగ్గరకు చదువుకోటానికి పోవటంలేదా?" అని అడిగింది.

కాళీ తలవూగిస్తూ "వెళ్ళకేం!" అంది.

"శేఖర్‌దా నా సంగతేమీ అడగటం లేదా?"

"లేదు. ఊహూం, మొన్న అడిగాడు — నువ్వు మధ్యాహ్నంపూట పేకాటకు వెళ్ళటం లేదా?"

లలిత ఉత్సుకురాలై "నువ్వా సంగతి చెప్పావా?" అని ప్రశ్నించింది.

"నువ్వు మధ్యాహ్నమప్పుడు చారుదీదీ యింటికి పేకాటకు వెళుతున్నావుగా! ఆసంగతే చెప్పాను. శేఖరుడా ఎవరెవరు ఆడుతున్నారని అడిగాడు. నువ్వు, చారు, చారుతల్లీ, చారువాళ్ళమామ - వీరే కాని నువ్వు బాగా ఆడుతావా! చారు దీదీ మామ బాగా ఆడుతాడా? నువ్వే బాగాఆడుతావంటుంది మనోరమ కదూ?"

లలిత ఆ మాటకు జవాబు చెప్పకుండా చటుక్కుని విసుక్కుంటూ "నువ్వా మాటలన్నీ ఎందుకు చెప్పావ్? అన్ని సంగతులూ నీకే కావాలి. ఇహ నీ కెప్పుడూ నేనేమీ యివ్వనుపో" అంటూ కోపంతో వెళ్ళిపోయిందక్కడ నుంచి.

కాళీ తెల్లబోయింది ఆమె యీ ఆకస్మిక పరివర్తనానికి కారణమేమిటో ఆపిల్ల గ్రహించలేకపోయింది.

మనోరమగారి యింటిదగ్గర పేకాట రెండు రోజులు బంద్ అయింది - లలిత రాలేదు. అసలు చూసినప్పటినుంచీగిరీన్ ఆకర్షితుడయినట్లు మనోరమ మొదటి నుంచీ అనుమానిస్తూనేవుంది. ఆ అనుమానం ఇవాళ మరీ బలపడింది.

ఈ రెండురోజుల నుంచీ గిరీన్ అదో విధంగా పరధ్యానంగానే వుంటున్నాడు. సాయంకాలం ఎక్కడికీ షికారుకు కూడా పోవటంలా. ఇంట్లోనే ఈ గదిలోంచి ఆగదిలోకీ ఆగదిలోంచి ఈగదిలోకి తిరుగుతున్నాడు. ఇవాళ మధ్యాహ్నం అక్కగారిదగ్గరకు వచ్చి "ఇవాళ కూడా ఆటలేనట్లేనా అక్కా?" అని అడిగాడు.

"ఏంచేస్తాం గిరీన్ ? నాలుగో మనిషి ఏదీ ? పోనీ ఇవాల్టికి మనం ముగ్గురమే ఆడదామా ?" అంది మనోరమ.

గిరీన్ నిరుత్సాహంతో "ముగ్గురిమీద ఆటమేం బావుంటుంది అక్కా ! వాళ్ళ లలితను ఒకసారి పిలిపించ రాదూ ?" అన్నాడు.

"ఆమె రాదు"

గిరీన్ ఆశ్చర్యపోతూ "ఎందుకురాదు ? వాళ్ళ వాళ్ళు వెళ్ళనద్దన్నారా యేం ?" అని అడిగాడు.

మనోరమ తల త్రిప్పుతూ "ఊహుం. వాళ్ళ మామయ్యా అత్తా అలాంటి వాళ్ళు కారు_ఆమె రానటం లేదు" అంది.

గిరీన్ చటుక్కున ఉత్సాహాన్ని వెలిపుచ్చుతూ "అయితే నువ్వోకసారి వెళ్ళి పిలిచావంటే తప్పకుండా వస్తుంది" అని అనేసి తనలో తనే ఆశ్చర్యపోయాడు.

మనోరమ నవ్వుతూ "సరే_అయితే వెడతాలే" అని వెళ్ళి ఒక్క-క్షణంలో లలితను వెంటపెట్టుకొచ్చి పేకాటముందు కూర్చోబెట్టింది.

రెండురోజుల నుంచీ ఆటలేదు. కాసేపట్లోనే ఇవాళ ఆట రక్తికి పడింది. లలిత పక్షమే గెలుపుగా వుంది.

ఓ రెండు గంటలు గడిచేసరికి కాళి గబగబా వచ్చి "శేఖర్‌దా పిలుస్తున్నాడు వదినా !_ ఊఁ. జల్దీ" అన్నది.

లలిత ముఖం వెలవెలపోయింది. ఆ పేకముక్కలు అక్కడ వదిలేసి "శేఖర్‌దా ఆఫీసుకు వెళ్ళలేదూ ?" అని అడిగింది.

"నాకేం తెలుసు? వెళ్లి వచ్చాడనుకుంటా" అని తల ఊగించి వెళ్ళిపోయింది.

లలిత పేక అక్కడ వదిలేసి మనోరమ ముఖంకేసి చూసి సంకోచిస్తూ "వెళ్ళొస్తా పిన్ని!" అంది

మనోరమ ఆమె చేయిపట్టుకుని "అదేమిటే? ఇంకా రెండు వరసలు తిరగనీ. వెళుదువుగాని" అంది.

లలిత కంగారు పడుతూ లేచి నుంచుని "కాదులేపిన్ని! అలా అయితే వారికి కోపంవస్తుంది"

అంటూ గబగబా వెళ్ళిపోయింది.

"శేఖర్‌దా ఎవరు అక్కయ్యా?" అని అడిగాడు గిరీన్.

"ఆయెదురుగా వున్న పెద్దమేడ వారి అబ్బాయి" అన్నది మనోరమ.

గిరీన్ తల వంకిస్తూ "ఓ-ఆ ఇల్లా? నవీన్‌బాబు వాళ్ల బంధువు కదూ!" అన్నాడు.

మనోరమ కూతురి ముఖంకేసి చూసి నవ్వి "వాళ్ల మేమిటి? ముసిలాడు లలితవాళ్ళ యిల్లుకూడా కలుపుకోవాలని ఎత్తు వేశాడు" అంది. గిరీన్ ఆశ్చర్యపోయి చూస్తూ వూరుకున్నాడు.

గత సంవత్సరం డబ్బులేక పోవటం మూలంగా గురుచరణబాబు కూతురి పెళ్ళి చేయలేక పోవటం, అప్పుడు విపరీతమైన వడ్డీకి నవీన్‌రాయ్ డబ్బు పెట్టుబడిపెట్టి ఇల్లు తాకట్టు పెట్టించుకోవడం, అన్నీ సమగ్రంగా మనోరమ కథలాగా అల్లిచెప్పి, "ఈ అప్పు ఎటూ తీరేదికాదు. చివరకు ఈ యిల్లు కూడా నవీన్‌రాయ్ ఎటూ కాజేస్తాడు" అంది.

మనోరమ ముందు విషయమంతా చెప్పి, చివరకు తన మనస్సులోని ఊహాకూడా చెప్పేసింది. "ముసలివాడి మనస్సులో ఉద్దేశ్యం ఏమిటంటే గురుచరణ్ పాతయిల్లు పడ కొట్టించి అక్కడ చిన్నకొడుకు శేఖరుడికి ఓపెద్ద మేడ కట్టించాలని- ఇద్దరు కొడుకులకూ రెండు వేరు వేరు మేడలు-ఉద్దేశం తక్కువదేంకాదు!"

ఈ సంగతంతా వినేసరికి గిరీన్‌కు కష్టం తోచింది. "సరేకాని అక్కయ్యా! గురుచరణబాబుకు యింకా ఆడపిల్లలున్నారు కదా? మరి వాళ్ళ పెళ్ళిళ్ళు ఎలా చేస్తారు?" అని అడిగాడు.

ఆయనకీ వున్నారు. పెళ్ళికాక ఇంకా లలితకూడా వుంది. పాపం ఆ అమ్మాయికి తల్లిదండ్రులు లేరు. ఆమె భారమంతా ఈ పేదవాళ్ళమీదనే వుంది. ఈడువొచ్చిన పిల్లకూడా ఈ సంవత్సరమయినా పెళ్ళిచెయ్యక తప్పదు. వాళ్ళసంఘంలో సహాయం చెయ్యటానికి ఎవ్వరూ రారు. వెలివేయటానికయితే అందరూ సిద్ధమే. మనసునే హాయిగా వుంది గిరీన్!" మొదలనుండా వ్రాసుకున్నారు మనోరమ చెప్పుకుపోతోంది. "ఆరోజున లలిత విషయం గుసగుసప్పి వాళ్ళ అత్త నాముందర రాగాలెట్టింది. ఏం చెయ్యటమో, ఎలా చెయ్యటమో పెళ్ళి వాళ్ళకు దిక్కుతోచటం లేదు. ఆ దిగులుతో గురుచరణుడికి పాపం నిద్రాహారాలుకూడా లేవు. ఆఁ అన్నట్టు ముంగేరులో కేవలం పిల్లను మెచ్చి పెళ్ళిచేసుకునేవాళ్ళని స్నేహితులెవరూ లేరూ? ఇలాంటి పిల్ల దొరకటం చాలా కష్టం"

గిరీన్ విషాదంగా ఓ నవ్వునవ్వి "స్నేహితులెవరున్నా నక్కయ్యా! డబ్బు కావాలంటేమాత్రం నేను సహాయం చెయ్యగలను" అన్నాడు.

గిరీన్ తండ్రి డాక్టరీచేసి చాలాఆస్తి డబ్బూకూడా కూడబెట్టిపోయాడు. దానికంతకీ గిరీనే ఇప్పుడు యజమాని.

"నువ్వు డబ్బు అప్పిస్తావా?" అని అడిగింది మనోరమ.

"ఇంకా అప్పేమిటక్కా! ఆయన తీర్చగలిగితే తీరుస్తారు. లేకపోతే లేదు"

మనోరమ విస్మితురాలైంది. "డబ్బు యిచ్చినందువల్ల నీకేమిటి లాభం? వాళ్లు మనకు బంధువులూ కారు. కనీసం మన సమాజంలోని వాళ్ళయినా కారు. ఇలా ఎవరైనా డబ్బు ఎవరికయినా యిస్తారా?" అంది.

గిరీన్ అక్కగారి ముఖంకేసిచూసి నవ్వుతూ "మన సమాజంలోని వాళ్లు కాకపోతే యేం? మన దేశీయులేకదా! వాళ్ళు ఏమీలేనివాళ్లు. నేను పుష్కలంగా డబ్బు ఉన్నవాణ్ణి నువ్వే ఒకసారి చెప్పిచూడు అక్కా! వాళ్లు తీసుకోటానికి అంగీకరిస్తే నాకేం అభ్యంతరంలేదివ్వటానికి. లలిత వాళ్ళకూ యేమీకాదు. నాకూ యేమీకాదు. ఆమె పెళ్ళికయ్యే ఖర్చంతా పోనీ నేనే యిస్తాను" అన్నాడు.

అతడి మాటలువిని మనోరమ అట్టే సంతుష్టురాలు కాలేకపోయింది. దీనివల్ల ఆమెకు పోయిందేమీ లేదు కాని యింతడబ్బు ఒకళ్ళకు ఒకళ్ళు యిస్తూంటే చాలామంది స్త్రీలు స్వభావంగా ప్రసన్నచిత్తంతో సహించి ఊరుకోలేరు.

చారుబాల ఇప్పటివరకూ మెదలకుండా వింటూ వూరుకుంది. ఆమె మహాసంతోషంతో ఎగిరిగంతేసింది. "అయితే ఇయ్యిమామయ్యా! నేనువెళ్ళి వాళ్ళ అత్తతో చెప్పివస్తాను" అంది.

"నువ్వుండుచారూ! చిన్నపిల్లవు నీకెందుకీ సంగతులన్నీ? చెప్పాల్సివస్తే నేనేవెళ్ళి చెబుతానులే" అని మనోరమ కూతుర్ని గద్దించింది.

"అయితే చెప్పుఅక్కా! మొన్న రోడ్డుమీద యెదురుపడితే గురుచరణబాబుతో కాస్సేపు మాట్లాడాను. చాల సరళ హృదయుడు. ఏమంటావు నువ్వు?" అని అడిగాడు.

"నేనూ అలాగేఅంటా. అందరూ అలాగేఅంటారు. వాళ్ళు భార్యాభర్తలిద్దరూ చాలా అమాయకులు. అందుకనే వాళ్ళకే కష్టాలు గిరీన్! ఇలాంటివాళ్ళు పాపం! ఇల్లూ వాకిలీకూడా లేకుండా నిరాశ్రయులుగా ఉండాల్సి వచ్చేట్టుంది. దానికి సిద్ధపడే చూస్తున్నావుగా గిరీన్, శేఖర్‌బాబు చిటికెవేయగానే చూశావా లలిత ఖంగారుగా లేచి ఎలా పరుగెత్తిందో? వాళ్ళ యింట్లోవాళ్ళు అందరూ శేఖర్‌బాబు కుటుంబానికి అమ్ముడుపోయినట్లు వుంటారు. కాని నీళ్ళెంత వాళ్ళని సంతోషపరచినా నవీన్‌రాయ్ చేతిలో ఉంటూ ఒకసారి పడ్డాక మళ్ళీ బైటపడతాననేది కల్లోమాట!"

"అయితే మరి నువ్వు చెబుతావా అక్కయ్యా?"

"సరే, అడుగుతాను. ఇనే, పోనీ నువ్వే ఉపకారం చేసినవాడవవుతావు. మంచిదేగా!" అని చిరునవ్వు నవ్వుతూ

"నీకేంటి ఇంత ఆసక్తి దేనికి గిరీన్?" అని అడిగింది మనోరమ.

"ఆసక్తి ఏముంది అక్కా, కష్టాల్లో వున్నప్పుడు ఒకరికొకరు ఆ మాత్రం సహాయ పడవలసిందేగా!" అంటూ అతను కొంచెం సిగ్గుపడుతూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు. గుమ్మందాకా వెళ్ళి మళ్ళీవచ్చి కూర్చున్నాడు.

"మళ్ళీ వచ్చి కూర్చున్నావేం?" అని అడిగింది మనోరమ.

గిరీన్ నవ్వుతూ "నువ్వు చెప్పిన ఈ దుఃఖగాథ అంతా నిజంకాదేమో అక్కా" అన్నాడు.

మనోరమ విస్మితురాలై "ఎందుకని?" అని అడిగింది.

"వాళ్ళ లలిత ఆ డబ్బు ఖర్చుపెట్టటం అదీ చూస్తే పేదవాళ్ళపిల్ల అని అనిపించదు అక్కా! ఆ రోజున మేము నాటకానికి వెళ్లాం. ఆమె రాకపోయినా పదిరూపాయలు ఇచ్చి పంపింది. ఎలా ఖర్చుపెడుతుందో ఇంకా చారును అడిగి చూడు. నెలకు ఆమె స్వంతఖర్చు కనీసం ఇరవైరూపాయలకు తక్కువకాదు"

మనోరమ విశ్వసించలేదు.

"నిజమే అమ్మా! అదంతా శేఖరబాబు డబ్బు ఇప్పుడే కాదు, చిన్నప్పటినుంచీ ఆమె శేఖరదా బీరువా తెరిచి డబ్బు తీసుకొస్తూవుండేది. ఎవ్వరూ ఏమీ అనరు" అన్నది కూతురు చారుబాల.

మనోరమ కూతురికేసి చూసి సందేహంతో "ఆడబ్బు తీసుకురావటం శేఖరబాబుకు తెలుసా?" అని అడిగింది.

చారు తలఊగిస్తూ "తెలుసు. ఆయన ఎరుకే తాళం తీసి తీసుకుంటుంది. పోయిన నెలలో అన్నాకాళీ బొమ్మల పెళ్ళికి అంతడబ్బు ఎవరు ఇచ్చారు? అంతా ఆమే యిచ్చింది" అంది.

మనోరమ కాస్సేపాలోచించి, "ఎవరెరుగుదురు? కాని ఒక్కమాటమాత్రం నిజం. కొడుకుమాత్రం తండ్రిలాగా అంత పీనాసికాడు. అతడు అంతా తల్లిపోలిక అందుకనే ఆ దయాధర్మాలూ అవీ. అదీ కాక లలిత చాలా మంచిపిల్ల. చిన్నప్పటినుంచీ కూడా కూడా తిరిగేది. అన్నా అని పిలిచేది. అందుకనే ఆమె అంటే అందరూ అంత అపేక్షగా చూస్తారు. ఆఁ. చారూ! నువ్వు వాళ్ళ యింటికి వెళుతూ వస్తూ వుంటావు కదా, వాళ్ళ శేఖర్‌కి ఈ మాఘమాసంలో పెళ్ళటగా! ముసిలాడు కట్నంక్రింద చాలాడబ్బు గుంజుతాడని వినికిడి" అంది.

"అవును అమ్మా! ఈ వచ్చే మాఘమాసంలోనే, అంతా నిశ్చయమయింది" అన్నది చారుబాల.

చిన్నవాళ్ళయినా, పెద్దవాళ్ళయినా నిస్సంకోచంగా మాట్లాడడగినవ్యక్తి గురుచరణుడు. నాలుగయిదు రోజుల పరిచయానికే గురుచరణుడికి గిరీన్‌తో ఒక విధమయిన స్నేహం యేర్పడింది గురుచరణుడి మనస్సులో కపటంలేదు. వాదించటం అంటే అతడికి ఎంతో యిష్టం. వాదంలో ఓడిపోయినా అతడేమాత్రం చిన్నపుచ్చుకునేవాడు కాదు.

సాయంకాలమప్పుడు గిరీన్‌ను టీకి రమ్మని పిలిచేవాడు. ఆఫీసునుంచి వచ్చేసరికే అతడికి ప్రొద్దు క్రుంకుతూవుండేది. కాళ్ళూ చేతులూ కడుక్కుంటూనే "లలితా! టీ తయారయిందా అమ్మా? శాళీ! వెళ్ళి నీ గిరీన్‌మామను పిలుచుకురా" అనేవాడు. తర్వాత యిద్దరూ టీ త్రాగి ఏదో తర్కించుకుంటూ వుండేవాళ్ళు.

లలిత అప్పుడప్పుడు వాళ్ళమామయ్య చాటున కూర్చుని మెదలకుండా వాళ్ళ సంభాషణ వింటూవుండేది. అలాంటప్పుడు గిరీన్‌కు ఎన్నెన్నో యుక్తిప్రయుక్తులు స్ఫురించేవి. సాధారణంగా ఆధునిక సమాజానికి విరుద్ధంగా వాదోపవాదాలు జరుగుతూవుండేవి. సమాజంయొక్క హృదయహీనత, అసంగతమైన ఉపద్రవాలూ, అత్యాచారాలూ అన్నీ యదార్థ విషయాలే

వీటిని సమర్థించటానికి సరియైన దృష్టాంతాలేవీ లేవు నిజానికి. అంకులల ఉత్పీడితమైన గురుచరణుడి హృదయంలో గిరీన్‌మాటలు ప్రతిఫలించేవి. చివరకతడు తలవూగిస్తూ "నిజమే గిరీన్! ఎవరి యిష్టాలకోసమునో కాకపోయినా ఎవరిపిల్లలను వాళ్ళు ఈడుమీరకుండా ఏదో మంచి సంబంధం చూసి పెళ్ళిళ్ళు చెయ్యాల్సిందే. కాని యెలా చెయ్యటం? పెళ్ళి చెయ్య పిల్లను ఈడుమీరుతోంది... అంటుంది సంఘం. కాని అలా చేసెయ్యటానికి తగిన సహాయం కాని, యేర్పాట్లుకాని చెయ్యదు. ఎవరిసంగతో ఎందుకు గిరీన్. నా సంగతే చూడరాదూ? ఇల్లుకూడా తాకట్టు పెట్టేశానుకదా! రెండ

పోతే పిల్లా జెల్లాను వెంటపెట్టుకుని రోడ్డుమీద నిలబడాల్సి వస్తుంది.

సమాజం అప్పుడైనా 'రండి, మా ఇంట్లో ఆశ్రయం తీసుకోండి, అని అనదు. ఏమంటావ్?' అనేవాడు.

గిరీన్ మెదలకుండా వూరుకునేవాడు. గురుచరణుడే మళ్ళీ చెప్పటం మొదలెట్టేవాడు "ఇది అక్షరాలా నిజం. ఇలాంటి సమాజంలో వుండడంకన్నా జాతిని వదులుకోవటం శ్రేయస్కరం. తిన్నా తినకపోయినా ప్రశాంతంగా పడి వుండొచ్చు. దుఃఖంలో వున్నవారి దుఃఖాన్ని అర్థం చేసుకో లేని సమాజం, కేవలం గ్రుడ్లురిమి, గొంతుపిసికే ఈ సమాజం నాలాంటి పేదవాళ్ళది కాదు. ఇది భాగ్యవంతులకోసం ఏర్పడిన సమాజం. సరే వాళ్ళనే వుండనీ: మాకు అవసరం లేదు" అని గురుచరణుడు చప్పున మౌనం వహించేవాడు.

ఈ యుక్తి ప్రత్యుత్తరాలు లలిత కేవలం శ్రద్ధగా వినటమే కాకుండా, రాత్రుళ్లు పడుకుని నిద్రపట్టేంత వరకూ తనలోతాను వీటినిగురించే ఆలోచించుకుంటూ వుండేది. ప్రతి మాట ఆమె మనస్సులో గాఢంగా నాటుకుపోయేది. గిరీన్ బాబు చెప్పేవన్నీ పూర్తిగా న్యాయసంగతాలే అని అనుకునేది మనస్సులో.

ఆమెకు మామయ్య అంటే చాలా అపేక్ష. ఆ మామను తన పక్షంలోకి లాక్కుని గిరీన్ చెప్పే సంగతులన్నీ అక్షరాలా యథార్థమనే తోచేది లలితమనస్సుకు. తన…

…చి తనకోసం చాలా వ్యాకుల పడుతున్నారు. ని

ఆ కారణం విని గిరీన్ సంతోషించలేదని లలిత గ్రహించింది.

ఇవాళ శనివారం. రోజూకంటె ఇవాళ సభ చాలా ఆలస్యంగా కాని ముగియదు.

టీ త్రాగటం పూర్తి అయింది. గురుచరణుడు రోజూ అంత ఉత్సాహంగా ఇవాళ సంభాషణలో పాల్గొనటంలేదు. మధ్య మధ్య పరాకుగా ఉంటున్నాడు.

గిరీన్ అది చటుక్కున గ్రహించి "ఇవాళ మీ వంట్లో అంత బాగా లేదనుకుంటాను" అని అడిగాడు.

గురుచరణుడు నోట్లో హుక్కా తీసి "ఏం? ఒంట్లో బాగానే వుంది" అన్నాడు.

గిరీన్ సంకోచిస్తూ "అయితే ఆఫీసులో ఏమైనా—" అన్నాడు.

"ఊహుఁ, అలాంటిదేమీ లేదు" అంటూ గురుచరణుడు పొగ వెళ్ళ విసురుతూ గిరీన్ ముఖంకేసి చూశాడు. ఆయన హృదయంలోని ఉద్వేగాన్ని యీ అమాయకుడు గ్రహించలేకపోయాడు.

లలిత ఇదివరకెప్పుడూ మాట్లాడేదే కాదు. కాని ఇటీవల తనూ మధ్య మధ్య రెండుమాటలు మాట్లాడుతోంది. "అవును మామయ్యా! ఇవాళ నీ మనస్సు బాగాలేదల్లే ఉంది" అన్నది.

గురుచరణుడు నవ్వుతూ "ఓ, అదా సంగతి! అవునమ్మా. నువ్వు సరిగ్గా కనిపెట్టావు. ఇవాళ నాకు సహజంగానే మనస్సు బాగా లేదు" అన్నాడు.

గురుచరణుడు స్పష్టంగా చెప్పేశాడు. "నవీన్ రాయ్ భార్య చాలా రోజులనుంచి జీర్ణవ్యాధితో బాధపడుతోంది. ఇప్పుడు వ్యాధి మరింత ప్రబలం కావటంవల్ల వైద్యులు గాలి మార్పుకు ఎక్కడికో తీసుకు వెళ్ళమన్నారట! డబ్బు అవసరం అంచేత ఇప్పుడు వడ్డీ అంతా, అసలులోకూడా కొంత తీర్చాలి"

గిరీన్ ఒక్కక్షణం ఊరుకుని "ఒక సంగతి మీతో చెపుదాం-చెపుదాం అని అనుకుంటూనే ఇప్పటివరకూ చెప్పలేకపోయాను. మీరు మనస్సులో ఏమీ అనుకోకుండా ఉంటానంటే చెబుతానది ఇప్పుడు" అన్నాడు.

గురుచరణుడు నవ్వి "నాతో ఏ సంగతి చెప్పాలన్నా [illegible] ఎప్పుడూ సంకోచించకు గిరీన్! ఏమిటా సంగతి?" అని అడిగాడు.

"అక్కయ్య చెప్పగా విన్నాను నవీన్ బాబు ఎక్కువ వడ్డీ తీసుకుంటాడట, అంచేత చెబుతున్నాను. నాకు చాలా డబ్బుంది. ప్రస్తుతం దాని ఉపయోగంకూడా నాకంతగా లేదు. వారికి అవసరమూను! పోనీ ఈ అప్పు తీర్చివెయ్యరాదూ?" అన్నాడు గిరీన్.

లలిత, గురుచరణుడు ఉభయులూ, నిస్తబ్ధంగా అతడి ముఖంకేసి చూస్తూ ఊరుకున్నారు. గిరీన్ ఎంతో సంకోచంతో చెప్పటం మొదలెట్టాడు. "నాకిప్పుడా డబ్బుతో అంత అవసరం లేదు. కనుక మీకు ఎప్పుడు వీలు అయితే అప్పుడు తీర్చవచ్చు. వారికి అవసరంగా? అందుకని చెబుతున్నాను."

"ఆపై కమంతా నువ్వే యిస్తావా? అని అడిగాడు. గురుచరణుకు

గిరీన్ తల వూంచుకుని "...రికి అవసరమయితే అలాగే యిస్తాను" అన్నాడు.

గురుచరణుకు సమాధానంగా ఏదో చెప్పబోయినాడు. ఇంతలో అన్నాకాళి చటుక్కున పరుగెత్తుకొచ్చింది. "వదినా! జల్దీ. శేఖర్ దా గుడ్డలు మార్చుకు వస్తుంటున్నాడు. నాటకం చూట్టానికి వెళ్ళాలి" అని ఎంత విసురుగా వచ్చిందో అంత విసురుగా వెళ్ళిపోయింది. ఆ పిల్లదాని హడావుడి చూసి గురుచరణుడు నవ్వుతున్నాడు. లలిత కదలకుండా అలాగే కూర్చుంది.

ఒక్క క్షణం పోయాక అన్నాకాళి మళ్ళీ వచ్చి 'ఏదీ! ఇంకా లేవలేదేం వదినా? మేమంతా నిలబడి వున్నాము" అంది.

అప్పటికీ లలిత లేచే లక్షణాలేమీ కనబడలా. ఆమె కాళీ చెప్పేది కొనసాగకా వినాలని అనుకుంది. కాని గురుచరణుడు కాళీ ముఖంకేసి చూసి నవ్వుతూ లలిత తల నిమిరి "అలా అయితే వెళ్ళు అమ్మా! ఆలస్యం చెయ్యకు. నీకోసం బహుశా అందరూ కనిపెట్టుకుని ఉన్నారనుకుంటాను." అన్నాడు.

ఇహ లేవక తప్పనిసరి అయింది లలితకు. కాని వెళ్ళే ముందు గిరీన్ కేసి గంభీరమైన కృతజ్ఞతాపూర్వక దృష్టిపరపి మెల్లమెల్లగా వెళ్ళిపోవటం గిరీన్ గ్రహించాడు.

పది నిమిషాలు పోయాక బట్టలూ అవీ మార్చుకుని తాంబూలం ఇద్దామనే మిషతో లలిత మరోమాటు మెల్లిగా బైటగదిలోకి వచ్చింది.

గిరీన్ వెళ్ళిపోయాడు. గురుచరణుడు ఒంటరిగా కళ్ళు మూసుకుని బాలీసుకు చేరగిలపడి పడుకున్నాడు. మూసుకున్న అతడి కనుకొలకుల్లోంచి కన్నీరు స్రవిస్తూవుంది. అవి ఆనందాశ్రువులై వుంటాయని లలిత గ్రహించింది. గ్రహించింది కనుకనే అతడికి ధ్యానభంగం కలిగించలా ఎంత నిశ్శబ్దంగా వచ్చిందో మళ్ళీ అంత నిశ్శబ్దంగా వెళ్ళిపోయింది.

ఆ తర్వాత కొంచెం సేపటికి ఆమె శేఖరుడి గదిలోకి వచ్చింది. అప్పటికింకా ఆమె కళ్ళు కన్నీటితో జలజలలాడుతూనే ఉన్నాయి. శాళీ లేదక్కడ. అందరికన్న ముందుపోయి బండిలో కూర్చుంది. శేఖరుడొక్కడూ అతడి గదిలో మెదలకుండా లలితకోసమే దారులు యెదురుచూస్తూ నుంచుని ఉన్నాడు. తల పైకెత్తి అశ్రుభారంతో వున్న ఆమె కళ్ళకేసి చూశాడు.

ఏడెనిమిది రోజులునుంచీ లలిత కనిపించక పోవటం వల్ల అతడు మనస్సులో కొంచెం కోపంగా వున్నాడు కాని ఇప్పుడదంతా మరచిపోయి ఉద్విగ్నతతో 'అదేమిటి? ఏడుస్తున్నావా?' అని అడిగాడు

లలిత తలవాంచుకుని లేదన్నట్టు తల ఊపింది.

ఇటీవల కొన్నాళ్ళనుంచీ లలిత బొత్తిగా కన్పించక పోవటంవల్ల శేఖరుడి మనస్సులో కొంచెం పరివర్తన కలిగింది.

అంతేనా అతడు దగ్గరగా వచ్చి రెండుచేతులతో లలిత ముఖం పైకెత్తి పట్టుకుని 'నిజంగానే ఏడుస్తున్నావే! ఏం జరిగింది?' అని అడిగాడు.

లలిత ఇహ తనను తాను సంభాళించుకోలేకపోయింది. అక్కడే చతికిలపడి చీరచెంగుతో ముఖం కప్పుకుని బావురుమని యేడ్చింది.

౬

నవీన్‌రాయ్ వడ్డీ అసలు ఫాయిదాలు దమ్మిడీలతో సహా లెక్కకట్టి తీసుకుని, తాకట్టు దస్తావేజు తిరిగి ఇచ్చివేస్తూ 'ఈ డబ్బు ఎవరిచ్చారోయ్?' అని అడిగాడు.

'ఆ మాట అడగవద్దు అన్నగారూ! ఈ సంగతి చెప్పననే షరతుమీద తీసుకొచ్చాను' అన్నాడు.

డబ్బు తిరిగి తీసుకోవటంవల్ల నవీన్‌రాయ్‌కి ఏమాత్రం సంతృప్తి కలగలా. అసలిది వసూలవుతుందని ఆశించనూ లేదు. వసూలు కావాలనికూడా వాంఛించ లేదసలు. ఈ యిల్లు కలుపుకుని దీన్ని పడగొట్టి క్రొత్తగా ఏ పద్ధతిని మేడ కట్టడమా అన్న సంగతే ఆలోచిస్తున్నాడు. కొంచెం వ్యంగ్యంగా 'ఇప్పుడు ఇలాంటి షరతులెన్నైనా పెడతావులే. అసలు తప్పు నీదికాదు భాయీ! నాదీ తప్పు. మళ్ళీ డబ్బు అడగటమే తప్పు లేకపోతే కలికాలం అని ఎందుకంటారు!' అన్నాడు.

ఆ మాటకు గురుచరణుడు నొచ్చుకొని "అదేం మాట అన్నయ్యా. మీ డబ్బు ఋణంఅంటే తీర్చాలేగాని, ఇంకా మీదయా ఋణం తీర్చనేలేకపోయాను.' అన్నాడు.

నవీనుడు నవ్వాడు. ఆయన ఎంతో అనుభవజ్ఞుడు. ఇలాంటి మాటలన్నీ విశ్వసించేవాడే అయితే వెల్లా వ్యాపారంలో అంతడబ్బు ఆర్జించనే లేకపోవును. సవ్యంగానిజంగా అలాగే అనుకుని వున్నట్లయితే ఇప్పుడిలా అప్పు తీర్చేవాడివే కాదు. అదీగాక ఒక్క సారి అడిగాను డబ్బు అవసరమని. అదయినా మీ వదిన కోసమని కాని నాకోసమేమీ కాదు అయినా తెలియక అడుగుతాను. ఎంత వడ్డీమీద తాకట్టు పెట్టావేమిటి ఇల్లు ?" అని అడిగాడు.

గురుచరణుడు తల త్రిప్పుతూ "తాకట్టు పెట్టలేదు. వడ్డీ ఇంతని కూడా ఏమీ అనుకోలేదు." అన్నాడు.

నవీనుడు విశ్వసించలేదు. "ఏమిటీ ? ఏమీ లేకుండా ఊరికినే యిచ్చాడా ?'' అని అడిగాడు.

'అవునన్నయ్యా ? ఇంచుమించు అంతే. ఆకుర్రవాడు చాలా మంచివాడు, చాలా దయగలవాడు కూడా'

'కుర్రవాడా ? ఏ కుర్రవాడు ?'

గురుచరణుడు ఆ ప్రశ్నకు జవాబు చెప్పకుండామౌనం వహించి ఊరుకున్నాడు. అసలంతవరకు నోరుజారటమే పొరపాటు.

నవీనుడు అతడి మనస్సులోని ఉద్దేశం గ్రహించి చిరునవ్వు నవ్వి "చెప్పకూడదని నిషేధం ఉన్నప్పుడు చెప్పవలసిన

"ఎందుకు రాదు?"

"నాహా. ఎలావస్తుందేమిటి? వచ్చే మాఘ ఫాల్గునా లలో పెళ్ళి. నాన్న వరుడికోసం తెగ తిరుగుతున్నాడు"

శేఖర్ కెప్పవాల్చకుండా స్తబ్దుడై అలాగే చూస్తూ నిలబడ్డాడు.

కాళి యింట్లో విన్న సంగతులన్నీ ఉత్సాహంగా ఒక్కొక్కటే చెప్పసాగింది. "ఎంత డబ్బు అయినా సరే, మంచి వరుణ్ణి వెతకమని చెప్పాడు గిరీన్ బాబు. మా నాన్న ఇవాళ కూడా ఆఫీసుకు వెళ్ళడు. భోజనమయ్యాక ఎక్కడికో వరుణ్ణి చూడటానికి వెడతారట! – వెంట గిరీన్ బాబుకూడా వెడతాడు."

శేఖరుడు తొణకకుండా అంతా వింటున్నాడు. లలిత తానెందుకు రానట్లు లేదో కారణంకూడా కొంతవరకు తెలుసుకున్నాడు.

కాళి చెప్తూనేపోతోంది. "గిరీన్ బాబు చాలా మంచి వాడు శేఖర్ దా! మా అక్క పెళ్ళికీ మా యిల్లు పెదబాబు గారికి తాకట్టు పెట్టారంగా! ఇంకా రెండు మూడు నెలలుపోతే మేమంతా బిచ్చమెత్తుకుంటూ వీధుల్లోనే కాపురం ఉండాల్సి వస్తుందని చెప్పాడు నాన్న.

అందుకని గిరీన్ బాబు డబ్బు ఇచ్చాడు. నిన్న ఆ పైకం చూపిస్తూ పెదబాబుగారికి ఇచ్చేశాడు నాన్న. ఇంక మనకేం భయంలేదని చెప్పింది వదిన. నిజమేగా శేఖర్ దా!"

శేఖరుడు జవాబేమీ చెప్పలేకపోయాడు. అలాగే చూస్తూ ఊరుకున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్ శేఖర్‌దా?" అని అడిగింది కాళీ.

ఈ సారి శేఖరుడు ఉలిక్కిపడి చటుక్కున "ఏమీ లేదే! కాళీ మీ వదినను ఒకసారి చప్పున పిలుచుకురా. నేను పిలుస్తున్నానని చెప్పు. ఊఁ. చప్పున వెళ్ళు" అన్నాడు.

కాళీ పరుగెత్తుకుంటూ వెళ్ళింది.

శేఖరుడు తెరిచిన పెట్టెకేసి చూస్తూ అలాగే కూర్చున్నాడు. అతడికి ఏవస్తువు అవసరమో ఏది అనవసరమో అన్నీ అప్పుడతడి దృష్టికి ఒక లాగానే ఉన్నాయి.

పిలుపు విని లలిత పైకివచ్చి మొగం కిటికీలోంచి చూసింది. శేఖరుడు నేలకేసి చూస్తూ సోఫామీద కూర్చుని ఉన్నాడు. అతడి ముఖం ఇలా ఉండటం ఇదివరకెన్నడూ చూడలేదు లలిత. లలితకు ఆశ్చర్యమూ వేసింది. భయమూ వేసింది. మెల్లగా దగ్గరకు రాగానే "రా" అని తొందరపాటుతో లేచి నిలబడ్డాడు శేఖరుడు.

లలిత మెల్లిగా "నన్ను పిలిచారా?" అని అడిగింది.

"ఊఁ" అని ఒక క్షణం ఊరుకుండి కూర్చుని "రేపు ప్రొద్దున్న రైల్లోనే అమ్మను తీసుకుని పశ్చిమదేశం వెళ్తున్నాను నేను ఈ సారి తిరిగిరావటం ఆలస్యం కావచ్చు. ఈ తాళాలు తీసుకో. నీ ఖర్చుకు కావల్సినడబ్బు ఆ బీరువాలో ఉంది" అన్నాడు.

ప్రతిసారీ లలితకూడా కూడాయిస్తూ ఉండేది. ప్రతి సారి ఈ ప్రయాణానికి ఎంత సాదాసీదా సామానులన్నీ సర్దింది. ఈసారి ఆపని శేఖర్‌దా ఒక్కడే చేసుకుంటున్నాడు. ఇది

పెట్టెకేసి చూడగానే లలితకు ఆ సంగతి జ్ఞాపకం వచ్చింది.

శేఖర్ ఆమెకేసి తిరిగి ఒకసారి దగ్గి గొంతు సవరించుకుని, "జాగ్రత్తగా వుండు — ఒకవేళ యేదైనా అత్యవసరమైన పరిస్థితిలో అన్నయ్య దగ్గరకు వెళ్ళి అడ్రస్ తీసుకుని ఉత్తరం రాయి" అన్నాడు.

తర్వాత కాస్సేపు ఇద్దరూ మెదలకుండా ఊరుకున్నారు. ఈసారి లలిత తనతో రాదని శేఖర్ తెలుసుకున్నాడు. బహుశా దానికి కారణం కూడా తెలుసుకుని ఉంటాడనుకొని లలిత సిగ్గుతో ముడుచుకు పోయింది.

"సరే వెళ్లు యిహ. ఇంకా నేను ఇవన్నీ సర్దుకోవాలి. చాలా టైమయింది ఒకసారి ఆఫీసుకు కూడా వెళ్ళిరావాలి" అన్నాడు.

లలిత తెరచిన పెట్టెదగ్గరకు వచ్చి కూర్చుని 'నువ్వు వెళ్ళి స్నానంచెయ్యి. నేను సర్దుతాను ఇవన్నీ' అంది.

'అయితే మంచిదే' అని శేఖరుడు తాళాలగుత్తి లలిత ముందుకు పడేసి, గది బైటికివచ్చి చటుక్కున ఆగిపోయి, 'నాకేమేమి అవసరమో మరచిపోవుగా' అన్నాడు.

లలిత తలవొంచుకుని పెట్టెలోవున్న వస్తువులను పరీక్షించ నారంభించింది. ఆమాటకేమీ జవాబు చెప్పలేదు.

శేఖరుడు క్రిందికి వెళ్ళి తల్లినడిగి, కాళీ చెప్పినదంతా నిజమేనని తెలుసుకున్నాడు. గురుచరణుడు అప్పు తీర్చిన మాటకూడా వాస్తవమే. లలితకు వరుణ్ణి వెతకటానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్న మాటకూడా యదార్థమే. అతడింకేమీ అడుగకుండా స్నానానికి వెళ్ళిపోయాడు.

రెండు గంటల్లో స్నానం భోజనం ముగించుకుని ఆఫీసు దుస్తులు వేసుకోటానికి గదిలోకి వచ్చి అతను నిజంగా స్తబ్ధుడైనాడు.

ఈ రెండుగంటల్లో లలిత యేమీ సర్దలేదు. పెట్టె మీద తల ఆనించి మెదలకుండా కూర్చుని ఉంది. శేఖరుడి కాళ్ళ చప్పుడువిని ఉలిక్కిపడి ఒకసారి తలయెత్తిచూసి మళ్ళీ తల వొంచుకుంది. ఆమె కళ్లు రెండూ మంకెన పువ్వులా ఎఱ్ఱగా వున్నాయి.

కాని శేఖరుడు అది చూసికూడా చూడలా. ఆఫీసు దుస్తులు వేసుకుంటూ సహజంగానే "ఇప్పుడిహ సర్దలేవులే లలితా! మధ్యాహ్నం వచ్చి సర్దుదువుగానిలే" అని ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

లలిత కళ్లు ఎఱ్ఱగపడటానికి కారణమేమిటో అతను గ్రహించాడు. కాని సాంకల్యంగా ఆలోచించనిదే ఏమాట అనటానికి సాహసించలేక పోయాడు.

ఆ రోజున సాయంకాలం వాళ్ల మామయ్యా వాళ్ళకు టీ తీసుకువచ్చి లలిత కంగారుపడింది. ఇవాళ శేఖరుడుకూడా కూర్చుని ఉన్నాడక్కడ. అతడు గురుచరణబాబు దగ్గర సెలవు తీసుకోటానికి వచ్చాడు.

లలిత తలవంచుకుని రెండుకప్పులు టీ తయారుచేసి ఒకటి మామయ్యముందర రెండోది గిరీనుముందర పెట్టగానే "శేఖర్ బాబుకు టీ యివ్వలేదేం లలితా?" అని అడిగాడు గిరీన్.

లలిత తల పైకెత్తకుండానే మెల్లిగా "శేఖర్ బాబు టీ తాగడు" అంది.

గిరీన్ యింకేమీ మాట్లాడలా. లలిత సంగతి జ్ఞాపకం వచ్చిందతడికి శేఖర్ తను తాగనూ తాగడు. ఇతరులు తాగటం యిష్టంకూడా ఉండదు అతడికి.

టీ కప్పు తీసుకొని గురుచరణుడు వరుడి ప్రస్తావన తీసుకొచ్చాడు. కుర్రవాడు బి. ఏ. చదువుతున్నాడంటూ, అతడి గుణవిశేషాలన్నీ కీర్తించి చివరకు "కాని మా గిరీన్‌కు నచ్చ లేదు. కుర్రవాడు చూపులకు అంత బాగుండడనే మాట నిజమేననుకో. కాని మగవాడికి అందం ఉంటే ఏంలాభం? మంచి గుణాలుంటే చాలు" అన్నాడు.

ఎలాగో అలా పెళ్ళి అయిపోతే గురుచరణుడి ప్రాణం కాస్త తెరపిన పడుతుంది.

శేఖరుడితో గిరీన్‌కు ఇదే పరిచయం. శేఖరుడు అతడి కేసిచూసి చిరునవ్వు నవ్వగా "గిరీన్ బాబుకు యెంచేత నచ్చ లేదు? కుర్రవాడు చదువుకున్న వాడేనాయె; స్థితికూడా బాగానే ఉందే! మంచి వరుడేగా!" అన్నాడు.

శేఖరుడు ఈ ప్రశ్న అయితే అడిగాడు కాని, గిరీన్‌కు యెందుకు నచ్చలేదో, ఇహముందు అయినా ఎందుకు నచ్చదో స్పష్టంగానే గ్రహించాడు. కాని గిరీను ఈ ప్రశ్నకు వెంటనే సమాధానమేమీ చెప్పలేకపోయాడు అతడిముఖం కొంచెం ఎర్రపడింది. శేఖరుడు అదికూడా గమనించి లేచినిలబడి "బాబాయ్, రేపు అమ్మను తీసుకుని పిల్లని చూడటానికి వెడతా

న్నాను. సమయానికి కబురు చెయ్యటం మరిచిపోకసుమా!" అన్నాడు.

"అదేమిటి నాయనా! మా బలగం అంతా మీరేగా! అదీగాక మీ అమ్మ లేనిదే ఇక్కడ ఏపనీ పూర్తికాదు. ఏమంటావమ్మా లలితా?" అంటూ నవ్వుతూ అతడు వెనక్కి తిరిగి చూశాడు. "అరే! ఎప్పుడో ఇక్కడనుంచి లేచి వెళ్ళిపోయిందే!"

ఈ ప్రస్తావన రాగానే పారిపోయింది" అన్నాడు శేఖరుడు.

గురుచరణుడు గంభీరంగా "పారిపోక ఏంచేస్తుంది? ఎన్ని చెప్పినా కాస్త జ్ఞానం వచ్చినపిల్లగా!" అని ఓ చిన్న నిట్టూర్పు విడిచి "మాతల్లి లక్ష్మి సరస్వతీకూడాను. ఇలాంటి పిల్ల ఎంతో అదృష్టం వుంటేనేకాని దొరకదు. శేఖర్నాథ్!" అనేసరికి శుష్కించిన అతడిముఖంలో ప్రస్ఫుటమయిన వాత్సల్యానికి గిరీనూ, శేఖరుడు శ్రద్ధగానూ అతడికి హృదయపూర్వకంగా నమస్కరించకుండా ఉండలేక పోయారు.

## ౨

లలిత టీ పార్టీనుంచి మెదలకుండా పారిపోయివచ్చి, శేఖరుడి గదిలో ప్రవేశించి, పెద్దలైటు వెలుగులో అతడి పెట్టెలో బట్టలూ అవీ సర్దడం మొదలెట్టింది. శేఖరుడు గదిలోకి రావటం చూసి, ముఖమెత్తి అతడి ముఖంకేసి చూసి, ఆమె భయాశ్చర్యాలతో స్తబ్ధురాలయింది.

దావాలో సర్వస్వమూ ఓడిపోయి కోర్టునుంచి అప్పుడే వచ్చినవాని ముఖం ఎలా వుంటుందో, ప్రొద్దున్నే చూసిన

వ్యక్తి అయినా అప్పుడు చూడగానే చటుక్కున ఎలా సర్దు పట్టలేమో అలాగే గంట క్రితం చూసిన శేఖరుణ్ని లలితకూడా చప్పున గుర్తించలేక పోయింది. అతడి ముఖంమీద సర్వస్వమూ పోగొట్టుకున్న చిహ్నాలు ఎవరో ముద్రవేసినట్లు కన్పిస్తున్నాయి. శేఖరుడు ఎండిన గొంతుతో "ఏమిటి లలితా ?" అని అడిగాడు.

లలిత ఆ ప్రశ్నకు జవాబు చెప్పకుండా కొంచెం దగ్గరగా వచ్చి తన రెండు చేతులతో అతడి చెయ్యి పట్టుకుని గద్గద కంఠంతో "ఏం జరిగింది శేఖరదా ?" అంది.

"ఎబ్బే! ఏమీ లేదు" అన్నాడు శేఖరుడు బలవంతాన తెచ్చిపెట్టుకున్న నవ్వుతో. లలిత కరస్పర్శతో అతడి ముఖంలోకి మళ్ళీ కొంచెం జీవకళ వచ్చింది. అతడు దగ్గరవున్న కుర్చీమీద కూర్చుని "ఏం చేస్తున్నావ్ ?" అని మళ్ళీ ఆ ప్రశ్నే అడిగాడు.

"ఓవర్ కోటు పెట్టెలో పెట్టడం మరిచిపోయాను. అది కూడా సర్ది పోదామని వచ్చాను." శేఖరుడు వింటూ ఊరుకున్నాడు. లలిత ఇప్పటికి కొంచెం తేరుకుని చెప్పసాగింది. క్రితంసారి నీకు ప్రయాణంలో చాలా ఇబ్బంది అయింది. పెద్ద కోట్లు చాలావున్నాయి కాని కొంచెం మందంగా ఉన్నకోటు ఒక్కటీలేదు. అంచేత తిరిగి రాగానే మారికోటు ఇచ్చి తయారు చేయించాను" అని ఆమె ఓ మొద్దుకోటు తెచ్చి, శేఖరుడి దగ్గర పెట్టింది.

శేఖరుడు ఆ కోటు తీసుకుని పరీక్షించి చూసి, "నాకు చెప్పావుకావేం ?" అని అడిగాడు.

లలిత నవ్వుతూ "మీరు దొరలారా! మీతో చెప్పితే ఇంత మొద్దుకోటు తయారు చేయించనిచ్చేవారా? అందుకని చెప్పలేదు. తయారుచేయించి ఉంచేశాను." అని ఆ కోటును యథాస్థానంలో ఉంచి, "సరిగ్గా పైనే పెట్టాను. పెట్టె తీయగానే కన్పిస్తుంది. చలివేసినప్పుడు తొడుక్కోటం మరిచిపోరుగదా సుమా!" అంది.

'సరే' అని శేఖరుడు చెప్పవాల్సివుండగా లలితకేసి చూసి 'ఉహూఁ. అది అసంభవం' అన్నాడు.

'ఏమిటీ అసంభవం? తొడుక్కోటమా?'

'ఉహూఁ. అదికాదు. అది మరోసంగతి. సరేగాని లలితా అన్నీ సామాను సర్దుకోటం అయిందేనా తెలుసా?' అని అడిగాడు శేఖరుడు.

"ఆఁ. మధ్యాహ్నం నేనే అన్నీ సర్దాను" అని లలిత మళ్ళ మరోసారి అన్ని వస్తువులూ పరీక్షించి పెట్టెతాళం వేయ సాగింది.

శేఖరుడు ఒక్క క్షణం మొదలు[illegible]ఊరుకొని కొంతసేపు "లలితా! వచ్చే సంవత్సరం నా పనులు ఎవరు చేసిపెడతారో చెప్పగలవా?" అని అడిగాడు.

లలిత కళ్ళు పైకెత్తి "ఏం?" అన్నది.

"ఏమో అది నాకే తెలుసు." అని తన విషయం కొద్ది పుచ్చుటానికి బలవంతాన ముఖంమీదికి నవ్వు తెచ్చుకుని "కాని పరాయి యింటికి వెళ్ళేముందు ఎక్కడెక్కడ ఏమివున్నదీ నాకు చూపించిమాత్రం వెళ్ళు, లేకపోతే అవసరం వచ్చినప్పుడు ఏ వస్తువూ దొరకదు" అన్నాడు.

లలిత కోపం తెచ్చుకుని "పోండి" అన్నది.

శేఖరుడు ఇంతసేపటికి నవ్వాడు. "వెళ్ళాలని నాకు [illegible], కాని ఏమిటా ఉపాయం అని? నాకు సరదా మాత్రం పూర్తిగా వుంది. కాని చిల్లిగవ్వయెత్తు ఓపికయినా లేదు. ఈ పనులన్నీ నా కర్మ వల్ల అయ్యేవికావు, ఇహ ఇక్కడి నుంచి మీ మామయ్యలాగా ఒక చొక్కా ఒక పంచెతో వుండాల్సి వస్తుందేమో! ఎలా జరగాల్సివుందో జరగక మానదు కదా!" అన్నాడు.

లలిత తాళపుచెవులు బల్లమీద పడేసి పారిపోయింది.

"రేపు ప్రొద్దున్నమాత్రం ఒకసారి రా" అని కేకేశాడు శేఖరుడు.

లలిత వినికూడా వినపించుకోలా. గబగబా మెట్లుదిగి వెళ్ళిపోయింది. డాబామీదికి వెళ్ళి చూసేసరికి అన్నాకాళీ ఇన్ని పూలు ముందరపోసుకుని దండగుచ్చుతోంది. లలిత దగ్గరగా వచ్చి "మంచులో కూర్చుని ఏమిటి చేస్తున్నావు కాళీ?" అని అడిగింది.

కాళీ ముఖం పైకెత్తకుండానే "దండగుచ్చుతున్నాను, ఇవ్వాళ రాత్రికి నాకూతురు పెళ్లి" అంది.

"ఏదీ, నాతో చెప్పావుకాదేం?"

"ఇప్పటిదాకా స్థిరపడనే లేదు వదినా! ఇప్పుడే నాన్న పంచాంగం చూసి, ఇవ్వాళ రాత్రి తప్పితే ఇహ ఈ నెల్లోనే ముహూర్తము లేదని చెప్పారు, పిల్ల పెద్దదయిందాయె. ఇంక

ఆపటానికి వీల్లేదు. ఎలాగో అలా పెళ్ళి చేసెయ్యాలి. నీకు రూపాయలు ఉంటే ఇవ్వు వదినా. తినుబండారాలూ అవి తీసుకురావాలి" అన్నది.

లలిత నవ్వుతూ "డబ్బు కావాల్సివస్తే వదినా! నువ్వే వెళ్ళి నా తలగడ క్రింద ఉన్నాయి తీసుకో. అప్పనేకాదు! ఒట్టి పూలదండలతోనే పెళ్ళి అవుతుందిలే" అన్నది.

కాళీ గంభీరంగా, "అవుతుంది. నేను ఎంతమంది పిల్లల్ని పెళ్ళిళ్ళుచేసి సాగనంపాను! నాకన్నీ తెలుసు" అని తినుబండారాలు కొనుక్కురావటానికి వెళ్ళిపోయింది.

లలిత అక్కడే కూర్చుని దండ గుచ్చటం మొదలెట్టింది.

ఒక్కక్షణంలో కాళీ మళ్ళీ తిరిగివచ్చి, అందర్నీ పిలవటం అయిపోయింది. ఇహ ఒక్క శేఖరదానే పిలవాలి. వెళ్ళి పిలిచివస్తాను. లేకపోతే ఆయనకు కష్టంగా ఉంటుంది అంటూ వెళ్ళిపోయింది.

కాళి పక్కాగృహిణి. అన్నిపనులూ సులభంగా చేసేస్తుంది. శేఖరదాతో చెప్పివచ్చి 'ఆయనకి ఒక దండ కావాలిట వదినా! నువ్వే చప్పున వెళ్ళి ఇచ్చిరారాదూ వదినా! నేను ఈలోగా ఇక్కడ యేర్పాట్లన్నీ చూస్తూవుంటాను. లగ్నం దగ్గరకు వచ్చేస్తోంది. ఇంక అట్టే వ్యవధానం లేదు' అన్నది.

లలిత తలత్రిప్పుతూ 'నేను వెళ్ళలేను కాళీ! నువ్వే ఇచ్చిరా' అన్నది

'సరే నడవాలే. ఆ పెద్దదండ ఇలా ఇవ్వు' అని చెయ్యి చాచింది కాళీ.

లలిత ఇవ్వబోయి మళ్లీ ఏమాలోచించుకుందో 'సరే, కాని నేనే ఇచ్చివస్తాలే' అన్నది.

కాళీ గంభీరంగా 'అయితే వెళ్లు వదినా! నాకు లక్ష పనులు. వద్దామన్నా తీరుబడి లేకుండా వుంది' అన్నది పెద్ద నాపసానిలాగా.

లలిత ఆ పిల్లదాని ముఖకవళిక ఆ మాటల తీరుచూసి నవ్వుకుంది. 'పెద్దపేరక్కాని' అంటూ దండతీసుకుని వెళ్ళిపో యింది. గుమ్మంలోకివచ్చి చూసేసరికి శేఖరుడు ఏదో ఉత్తరం వ్రాసుకుంటున్నాడు. తలుపు తెరచి అతడి వెనకాలకి వచ్చి నుంచుంది. అప్పటికీ శేఖరుడు గమనించలేదు. ఒక్క నిమిషం మెదలకుండా ఊరుకుని అతణ్ని ఉలిక్కిపడేట్లు చెయ్యాలనే ఉద్దేశంతో వెనుకనుంచి జాగ్రత్తగా ఆ దండ అతడి మెళ్లోవేసింది.

శేఖరుడు మొదట్లో ఉలిక్కిపడి 'ఏమిటేకాళీ' అని అంతలో వెనక్కి తిరిగిచూసి ఎంతో గంభీరంగా 'ఏంపని చేశావు లలితా?' అని అడిగాడు.

లలిత లేచినుంచుని శేఖరుడి ముఖంలోని భావాన్ని చూచి సంకోచిస్తూ 'ఏం? అని అడిగింది.

శేఖరుడు గాంభీర్యం ఏమాత్రం చెదరకుండా 'తెలియదూ! కాళీని పోయిఅడిగిరా. ఇవాళ రాత్రి మెళ్లో దండవేస్తే ఏమవు తుందో అడిగిరా దాన్ని' అన్నాడు.

లలిత అప్పటికి గ్రహించింది. ఒక్క రెప్పపాటులో ఆమె ముఖం సిగ్గుతో ఎర్రగా కందగడ్డ అయింది. 'కాదు, కాదెన్నటికీ కాదు' అంటూ గదిలోంచి పారిపోయింది.

"వెళ్ళకు లలితా! విని వెళ్ళు, ముఖ్యమైన పనివుంది ఒకట్టి" అని కేకేశాడు శేఖరుడు.

శేఖరుడి పిలుపు ఆమె చెవినిపడింది. కాని ఎందుకు వినిపించుకుంటుంది! ఆమె ఎక్కడా ఆగకుండా సరాసరి తన గదిలోకి పరుగెత్తుకువచ్చి కళ్ళుమూసుకుని పక్కమీద పడు కుంది.

ఈ అయిదారేళ్ళనుంచీ లలిత శేఖరుడి సంరక్షణ క్రిందనే పెరిగింది. కాని యెన్నడూ ఇలాంటిమాటలు విని యెరుగదు. గంభీర స్వభావుడైన శేఖరుడు ఎన్నడూ ఆమెను పరిహాసంకూడా చేసేవాడు కాదు. అథవా చేసినా ఇంత లజ్జాకరమైన పరిహాసోక్తులు అతడి నోటినుంచి వెలువడుతా యని ఆమె కల్లోకూడా అనుకోలేదు. సిగ్గుతో ముడుచుకు పోయి ఓ పావుగంట అలాగే పడివుండి లేచి కూర్చుంది. శేఖ రుడు అంటే ఆమెకు లోపల కొంచెం జంకుగానే వుంటుంది. పైగా, ముఖ్యమైన పని వుందని పిలిచాడు. కనుక వెళ్ళటమా మానటమా అని లలిత లేచి కూర్చుని ఆలోచించసాగింది. ఇంతలో వాళ్ళయింటి దాసీదాని పిలుపు వినిపించింది. "లలి తమ్మగారూ! చినబాబుగారు పిలుస్తున్నారు మిమ్మల్ని—"

లలిత బైటికివచ్చి, "వస్తున్నా, పద" అన్నది.

మేడమీదికి వచ్చి తలుపు సందుల్లోంచి చూసేసరికి శేఖరుడు ఇంకా ఉత్తరం రాస్తూనే వున్నాడు. కాసేపు అలాగే మెదలకుండా ఊరుకుని మెల్లిగా "ఎందుకు పిలిచింది?" అని అడిగింది.

శేఖరుడు వ్రాసుకుంటూనే "దగ్గరకు రా, చెప్తాను" అన్నాడు.

"ఉహూం. ఇక్కడే వుంటాను చెప్పండి"

శేఖరుడు తనలోతాను నవ్వుకుని "నువ్వు హఠాత్తుగా ఇలాంటిపని యెందుకు చేశావో చెప్పు" అన్నాడు.

లలిత ఉక్రోషంతో "పోండి, మళ్ళీ అదేమాటా?" అన్నది.

శేఖరుడు ఇటుతిరిగి "నాతప్పు యేముందీ? నువ్వు చేసి వెళ్ళినపనేగా-" అన్నాడు.

"ఏమీ చెయ్యాలా. ఆ దండ నాకిచ్చెయ్యండి"

'అందుకోసమే పిలిచింది లలితా! దగ్గరకు రా, ఇచ్చేస్తాను. సగంచేసి పోయావునువ్వు. నన్ను దాన్ని పూర్తి చెయ్యనీ'

లలిత గుమ్మంచాటునే ఒక్క క్షణం మౌనంగా నుని 'నిజం చెపుతున్నా. అలా నన్ను వేళాకోళమా. ఇంకెప్పుడూ మీ యెదుటికి రాను. నేను చెబుతున్నాను. ఆదండ తిరిగి ఇచ్చెయ్యండి' అన్నది.

శేఖరుడు టేబిల్‌వైపు ముఖంత్రిప్పి, 'ఇదిగో తీసుకు వెళ్ళు' అన్నాడు.

'అక్కడినుంచే విసిరివెయ్యండి.'

శేఖరుడు తలత్రిప్పుతూ 'దగ్గరకువస్తేనే కాని ఇవ్వను' అన్నాడు.

'అయితే నా కక్కర్లా' అంటూ కోపంతో వెళ్ళిపోయింది లలిత.

'కాని సగంలో ఆగిపోయింది___' అని కేకేశాడు శేఖరుడు.

'ఆగితే ఆగిందిలే' అని లలిత నిజంగానే కోపంతో వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళింది నిజమే. కాని క్రిందకు వెళ్ళలా. తూర్పు వైపు ఉన్న డాబామీదకు వెళ్ళి పిట్టగోడను ఆనుకుని కదలకుండా నుంచుంది. ఎదురుగా చందమామ అప్పుడే పైకి వస్తోంది. చుట్టూ వెన్నెల ధగధగలాడుతోంది. పైన స్వచ్ఛమైన నీలాకాశం. ఆమె ఒక్కసారి శేఖరుడి గదికేసి చూసి మళ్ళీ ఆకాశంకేసి చూడసాగింది. ఆమెకళ్లు సిగ్గుతోనూ అభిమానంతోనూ అశ్రుసిక్తాలయినాయి. ఆమె ఈ మాటల తాత్పర్యమంతా గ్రహించలేనంత పసిపిల్లకాదు. అయినా ఆమెను బాధకలిగించే ఈ పరిహాసం ఎందుకు చెయ్యాల్సి వచ్చిందీ. ఆమె తానెంత అల్పురాలో తెలుసుకొనేటంత వయస్సు ఉంది ఆమెకు. తాను ఆశ్రయహీనురాలనీ, దిక్కు లేనిదనీ తనను అందరూ ఆదరిస్తూవుంటారని ఆమెకు తెలుసు. శేఖరుడూ ఆదరిస్తూఉంటాడు. ఆమె తల్లికూడా అలాగే ఆదరిస్తుంది! ఆమెకు ఆత్మీయులంటూ యెవరూలేరు. నిజంగా ఆమె బాధ్యతను పూర్తిగా పైన వేసుకునేవారు లేకపోవటంవల్లనే గిరీనుడు కేవలం పరాయివాడైనప్పటికీ ఆమెను ఉద్ధరిస్తానని అనగలిగాడు.

లలిత కన్నీళ్లు తుడుచుకుని తనలోతాను అనుకున్నది. ఈ కలకత్తా సమాజంలో తన మామయ్య స్థితి శేఖరుడు వాళ్ళ దృష్ట్యా ఎంతహీనం! తాను ఆ మామయ్యనే ఆశ్ర

యించుకుంది! అక్కడే శేఖరుడితో సమాన ధాయాగలవారి యింట అతడి పెళ్ళిప్రసంగం జరుగుతూవుంది. రెండురోజులు అటోయిటో ఆ సంబంధమే ఖాయం అవుతుంది అతడికి. ఈ పెళ్ళికి నవీన్‌రాయ్ కట్నంరూపంలో ఎంతడబ్బు గుంజాలను కుంటున్నాడో ఆ సంగతులన్నీ లలిత శేఖరుడి తల్లి దగ్గర విన్నదికూడా.

ఇదంతా ఇలా ఉండగా శేఖరుడివాళ హఠాత్తు తనకెందుకింత అవమానం చేశాడు! ఈ సంగతులన్నీ లలిత శూన్యంలోకి చూస్తూ తనలోతాను ఆలోచించుకోసాగింది. చటుక్కున ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూసేసరికి శేఖరుడు నవ్వుతూ నిలబడి ఉన్నాడు. ఇంతకుముందు ఏ ఉపాయంతో తాను శేఖరుడు మెళ్లో ఏదండ అయితే వేసిందో సరిగ్గా అదే దండ, ఆ ఉపాయంతోనే ఇప్పుడు ఆమె మెళ్లోకి వచ్చిపడింది. దుఃఖంతో ఆమెగొంతు బొంగురుపోయింది. అయినా బలవంతాన మాట పెకలించుకుని జీరవోయినకంఠంతో "ఎందుకిలా చేశారు'" అని అడిగింది.

"నువ్వెందుకు చేశావు?"

"నేనేమీ చెయ్యలా" అంటూ ఆమె ఆ దండను త్రెంచి వెయ్యబోయి అంతలో శేఖరుడి కళ్ళకేసి చూసి ఆగిపోయింది. ఇంక త్రెంచి పారెయ్యటానికి సాహసించలేకపోయింది. కాని ఏడుస్తూ "నాకు 'నా' అన్నవారు ఎవరూ లేరనేనా మీరిలా అవమానం చేసింది?" అని అడిగింది.

శేఖరుడు ఇంతవరకు ముసిముసినవ్వులు నవ్వుతున్న వాడల్లా లలితమాటలువిని తెల్లబోయాడు. ఇవి చిన్నపిల్ల మాటలు కావు.

"నేను అవమానం చెయ్యలా. నువ్వే. అవమానం చేశావేమో!" అన్నాడు.

లలిత కళ్ళు తుడుచుకుని "నేనేంఅవమానం చేశాను?" అంది భయభయంగా.

శేఖరుడు ఒక్క క్షణం తటాయించుకుని అతి మామూలు ధోరణిలో "కాస్త ఆలోచించి చూస్తే నీకే తెలుస్తుంది! ఇటీవల నువ్వు మరీ హద్దుమీరిపోతున్నావు లలితా! అందుకనే నేను పరదేశం పోయేముందు నిన్నొక పరిధిలో బంధించిపోతున్నాను" అని మెదలకుండా ఊరుకున్నాడు.

లలిత ఇంక జవాబు చెప్పలా. తలవంచుకుని అలాగే నిలబడింది. ఆ స్వచ్ఛమైన వెన్నెలలో ఇద్దరూ మౌనంగా నుంచునిఉన్నారు. క్రిందినుంచి కాళీమాతుని పెళ్ళితాలూకు శంఖధ్వనిమాత్రం వినవచ్చింది.

కొంచెంసేపు మౌనంగా నిలబడ్డాక "ఇంక అట్టేసేపు మంచులో నిలబడకు. క్రిందికివెళ్ళు" అన్నాడు శేఖరుడు.

"వెడుతున్నాను" అంటూ ఇంతసేపయాక అప్పుడు అతడిపాదాలకు నమస్కరించి లేచి, నన్నేంచెయ్యమంటారో చెప్పి వెళ్ళండి" అన్నది మెల్లగా.

శేఖరుడు నవ్వాడు. ఒకసారి కొంచెం తటపటాయించాడు. తర్వాత రెండు చేతులతో ఆమెను దగ్గరకు తీసుకుని

హృదయానికి హత్తుకుని ఆమె అధరాన్ని తన అధరాలతో స్పృశించి "ఇంకేమీ చెప్పనక్కర్లేదు లలితా! నేటినుంచీ నీ అంతట నువ్వే తెలుసుకోగలవు" అన్నాడు.

లలిత శరీరమంతా గగుర్పొడిచి కంపించింది. ఆమె కొంచెందూరంగా జరిగి నిలబడి "ఇవాళ నేను హఠాత్తుగా మీ మెళ్లో దండ వేశాననేనా మీరిలా చేసింది?" అని అడిగింది.

శేఖరుడు నవ్వుతూ తల త్రిప్పుతూ "కాదు. కాని నేను చాలా రోజులనుంచి అనుకుంటున్నాను. కాని నిర్ధారించుకోలేకపోయాను. ఇవాళ నిశ్చయించుకున్నాను. ఎంచేతనంటే నిన్ను విడిచిపెట్టి ఉండలేనని ఇవాళే గ్రహించాను నేను" అన్నాడు.

"కాని మీనాన్నవింటే చాలా కోప్పడుతారు. అమ్మ గారిని పడితే చాలా దుఃఖిస్తుంది. ఇది నెరవేరదు_"

"నాన్నవింటే కోప్పడేమాట నిజమే కాని అమ్మ విన్నదంటేమాత్రం చాలా సంతోషిస్తుంది. ఏది ఎలా అయినా జరగవల్సిందేదో జరిగిపోయింది ఇంక నువ్వూ తప్పించుకోలేవు. నేను తప్పించుకోలేను. వెళ్ళు. క్రిందికివెళ్ళి అమ్మకు నమస్కరించు" అన్నాడు శేఖరుడు.

౮

మూడు మాసాలు గడిచాక ఒకరోజున గురుచరణుడు వాడిపోయిన ముఖంతో నవీన్‌రాయ్ ఇంటికివచ్చి 'కార్పెట్' మీద కూర్చోబోతూండగా "ఉహూఁహూఁ. అక్కడవద్దు. ఆ కుర్చీమీదకు పోయి కూర్చో. ఈ అసమయంలో నేను

మళ్ళీ స్నానం చెయ్యలేను నువ్వు జాతి వదులుకున్నావట కదూ!" అన్నాడు నవీన్‌రాయ్.

గురుచరణుడు దూరంగావున్న కుర్చీలోకి పోయి తల వొంచుకుని కూర్చున్నాడు. నాలుగయిదు రోజులక్రితం అతడు యథావిధిగా దీక్ష పుచ్చుకుని బ్రహ్మమతావలంబి అయ్యాడు. ఇవాళ ఆ సంగతి చిత్రవిచిత్రంగా జల్లిక అయి సనాతన హిందువు అయిన నవీన్‌రాయ్ చెవినపడింది. నవీన్‌రాయ్ కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి, కాని గురుచరణుడు మాత్రం తల వొంచుకుని అలాగే మెదలకుండా కూర్చున్నాడు. అతడు ఎవ్వరిని సలహా అడగకుండా ఈపని చేసినప్పటినుంచీ ఇంట్లో ఏడ్పులూ మొత్తుకోళ్ళూ జాస్తిఅయి శాంతి అనేది లేకుండా పోయింది మనస్సుకు.

"చెప్పవోయ్! నిజమా? కాదా?" అని గద్దించి అడిగాడు మళ్ళీ నవీన్‌రాయ్.

గురుచరణుడు గ్రుడ్లనీరు గ్రుడ్ల గ్రుక్కుకుంటూ తలెత్తి "చిత్తం, నిజమే" అన్నాడు.

"ఎందుకిలాంటి పనిచేశావ్? నీ జీతం అరవైరూపాయలు తోటి, నువ్వు—" కోపంతో నవీన్‌రాయ్ నోటినుంచి ఇంక ఆ పైమాట రాలేదు.

గురుచరణుడు కళ్ళు తుడుచుకుని, బొంగురుపోయిన గొంతు సవరించుకుని, "అప్పుడజ్ఞానం లేక పోయింది అన్నయ్యా. దుఃఖావస్థలో అప్పుడు కంఠానికి ఉరిపోసుకోవటమూ, బ్రాహ్మసమాజంలో చేరటమూ ఏదీ నిర్ణయించుకోలేక

పోయాను. చివరకు ఆత్మఘాతిని కావటంకన్న బ్రహ్మజ్ఞానిని కావడమే మంచిదనుకుని అందులో చేరాను" అన్నాడు.

గురుచరణుడు కళ్లు తుడుచుకుంటూ బైటికి వెళ్ళి పోయాడు.

"మంచిపని చేశావ్. నీ మెడకు ఉరి తగిలించుకోకుండా జాతిమెడకు తగిలించావు. సరే, వెళ్ళు, ఇంక నీ ముఖం ఎన్నడూ చూపించకు నాకు. నీకెవరైతే యీ సలహా ఇచ్చారో వాళ్ళతోనే పోయివుండు. ఇంక నీ కూతుళ్లను అడ్డమైన వాళ్లకీ తీసుకెళ్ళి ఇయ్యి" అని అతణ్ని పంపించేసి ముఖం ఇటు త్రిప్పుకుని కూర్చున్నాడు.

నవీనుడు కోపంతోనూ, అభిమానంతోనూ ఏం చెయ్యాలో మొదట ఆలోచించుకోలేక పోయాడు. గురుచరణుడు తన చేతుల్లోంచి పూర్తిగా తప్పించుకుపోయాడు. ఇంక మళ్ళీ త్వరలో తన గుప్పెట్లోకి వస్తాడనే ఆశకూడా లేదు. అందుచేత నిష్ఫలమైన ఉక్రోషంతో ఉడుకెత్తిపోయి, చివరకు అతణ్ని హద్దులో ఉంచటానికి తగిన ఉపాయమేమీ తోచక ఆరోజునే తాపీమేస్త్రీని పిలిపించి వారింటికీ వీరింటికీ వచ్చే పోయేదారి మూసేయిస్తూ పెద్ద గోడకట్టించాడు.

ఈ సంగతి దూరదేశంలోవున్న భువనేశ్వరి శేఖరుని ద్వారా విని దుఃఖించింది. "శేఖర్! ఈ దుర్బుద్ధి ఎవరు పుట్టించారురా అతడికి?" అని అడిగింది. ఈ దుర్బుద్ధి ఎవరు పుట్టించారో శేఖరుడు ఊహించాడు. కాని ఆ సంగతి బైట పెట్టకుండా "కాని అమ్మా! రెన్నాళ్ళు పోయాక అయినా మీరే అతణ్ని వెలివేసేవారుగా! ఇంతముందు ఆడపిల్లలను

అసలు ఎలా పెళ్ళిళ్ళు చెయ్యగలవో నాకేం బోధపడకుండా ఉంది" అన్నాడు.

భువనేశ్వరి తలతిప్పుతూ "ఏమీ ఆగిపోవు శేఖర్! కేవలం అందుకోసమని జాతి వదులుకుంటే చాలా కావొచ్చు. వాళ్ళను సృష్టించిన ఆ భగవంతుడే ఆ భారమూ వహిస్తాడు." అన్నది. శేఖర్ మెదలకుండా ఊరుకున్నాడు. భువనేశ్వరి కళ్ళు తుడుచుకొని "మన లలితను నాతో కూడా తీసుకొచ్చినట్లయితే దానికేదో ఉపాయం నేనే ఆలోచించాల్సి వచ్చేది, ఆలోచించేదాన్ని కూడా. కాని ఈ ఉద్దేశం మనసులో ఉంచుకునే గురుచరణుడు దాన్ని పంపలేదని నాకు తెలియదు. నేను నిజంగా దానికి సంబంధం కుదిరిందనే అనుకున్నా" అన్నది.

శేఖరుడు తల్లి ముఖంకేసి చూసి కొంచెం సిగ్గుపడుతూ 'అలా అయితే బాగానే ఉండేది! ఇప్పుడైనా ఇంటికి వెళ్ళి ఆపని ఎందుకు చెయ్యకూడదూ? లలిత యింకా ఆ సమాజంలో చేరలేదట! వాళ్ళ మామయ్యమాత్రమేనట చేరింది! అదీగాక ఆయనకూడా ఆమెను నిజానికి స్వంత మేనమామేం కాదు గదా! లలితకు ఎవరూ లేకపోబట్టి వాళ్ళయింట్లో పెరిగింది కాని!' అన్నాడు.

భువనేశ్వరి ఆలోచించి 'అది నిజమే. కాని మీనాన్న గారెలాంటి మనిషి. ఆయన అందుకేసమాత్రం ఒప్పుకోడు. [illegible] వాళ్ళ ముఖంకూడా చూడనివ్వడు' అన్నది.

శేఖరుడి మనస్సులో ఇదే అనుమానం. అతడింకేమీ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

ఇహ ఒక్క నిమిషంకూడా అతడికి అక్కడ ఉండబుద్ధి పుట్టలేదు రెండుమూడు రోజులు ఏమీ తోచక అక్కడా అక్కడా తిరిగివచ్చి ఒకరోజున సాయంకాలం 'ఇక్కడ నాకేం బాగుండటం లేదమ్మా! ఇంటికి వెళ్ళిపోదాం' అన్నాడు.

భువనేశ్వరి వెంటనే ఒప్పుకుని 'అయితే పద శేఖర్! నాకూ ఏమీ బాగుండటంలేదు' అన్నది.

తల్లీ కొడుకులిద్దరూ ఇంటికివచ్చి చూసేసరికి వారియింటికీ వీరి యింటికీ మధ్య పెద్దగోడ కట్టిఉంది. గురుచరణుడితో ఎలాంటి సంబంధమయినా పెట్టుకోవటంకాని, అంతెందాకా యెందుకు అసలతడితో మాట్లాడటంకూడా నవీన్‌రాయ్‌కు ఏమాత్రం యిష్టంలేదన్న సంగతి ఎవరినీ అడగకుండానే ఉభయులూ గ్రహించారు.

రాత్రి శేఖరుడు భోజనం చేస్తున్నప్పుడు భువనేశ్వరి దగ్గరే కూర్చునిఉంది. ఆ మాటమీద ఈ మాటమీద ఆవిడ అన్నది. 'వాళ్ళ గిరీన్ బాబుకు లలితనుయిచ్చి చెయ్యాలని సంప్రదింపులు సాగుతున్నాయి. ఇలా జరుగుతుందని నేనిదివరకే ఊహించాను'

శేఖరుడు తల పైకెత్తకుండానే 'ఎవరు చెప్పారు?' అని అడిగాడు.

'వాళ్ళ అత్త. మధ్యాహ్నం మీనాన్న నిద్రపోయేటప్పుడునేనే వాళ్ళ యింటికివెళ్ళి చూసివచ్చాను. అక్కడ కూర్చున్నంతసేపూ ఆవిడ ఒకటేపనుగా అని ఒక క్షణం ఆగి, ఆమె లవకళ్లు పమిటచెంగతో ఒత్తుకుని 'ప్రారబ్ధం శేఖర్. ప్రారబ్ధం.

నొష్టను రాసినరాత ఎవరూ తప్పించలేరు. ఎవరిదితప్పు అని మాత్రం ఎలా చెప్పగలమో చెప్పు. అయిందేమో అయిపోయింది. గిరీన్ కూడా కుర్రవాడు మంచివాడే. ఆస్తికూడా వుంది. లలితకేమీ కష్టంవుండదు' అని మెదలకుండా ఊరుకుంది.

శేఖరుడు ఏమీ సమాధానం చెప్పలేదు. తలవంచుకుని అన్నం అటూయిటూ కదుపుతూ కూర్చున్నాడు. ఓ క్షణ మయ్యాక తల్లి లేచి వెళ్ళగానే తానుకూడా లేచివెళ్ళి చెయ్యి కడుక్కొని ప్రక్కమీదకుపోయి పడుకున్నాడు.

మర్నాడు సాయంత్రం కాస్సేపు అలా అలా తిరిగి వద్దామని బయలుదేరాడు శేఖరుడు. అప్పుడు గురుచరణుడింట్లో మామూలు టీ సమావేశం జరుగుతోంది. నవ్వులూ కబుర్లూ మంచి ఉత్సాహంగా సాగుతున్నాయి అవన్నీ శేఖరుడి చెవిని పడేసరికి అతడు ఒక్క క్షణం ఏమాలోచించుకున్నాడో మెల్లిగా గురుచరణుడి గదిలోకి వెళ్ళాడు. చటుక్కున ఆ కోలాహలమంతా ఆగిపోయింది. అతడి ముఖంకేసి చూడగానే అందరి ముఖాలూ మారిపోయాయి.

శేఖరుడు ఊరినుంచి వచ్చాడన్న సంగతి ఒక్క లలితను తప్ప ఎవ్వరికీ తెలియదు. ఇవాళ గిరీన్‌తోపాటు మరో పెద్దమనిషికూడా కూర్చునిఉన్నాడు. అతడు ఆశ్చర్యంతో శేఖరుడి ముఖంకేసి చూడసాగాడు. గిరీన్ ముఖంలోకి గాంభీర్యం తెచ్చుకుని గోడకేసి చూస్తూ కూర్చున్నాడు. అందరికన్నా ఎక్కువగా అనుస్తున్నది గురుచరణుడు. అతడిముఖం పాలిపోయింది.

అతడి చేతి ప్రక్కనే కూర్చుని లలిత టీ తయారుచేస్తోంది. ఒక సారి ముఖం పైకెత్తి చూసి మళ్ళీ తల వాంచుకుంది.

శేఖరుడు ముందుకువచ్చి బల్లమీద తల ఆనించి నమస్కరించి ఒక ప్రక్క కూర్చుని నవ్వుతూ 'ఇదేమిటి? అంతా ఒక్కసారి చల్లబడిపోయిందేం!' అన్నాడు.

గురుచరణుడు మెల్లగా ఏదో ఆశీర్వదించాడల్లే ఉంది! కాని అతను ఏమన్నదీ మాత్రం సరిగ్గా తెలియలేదు.

ఆయన మనస్సులోని ఉద్దేశం శేఖరుడు గ్రహించాడు. కాలం గడపటానికి తన సంగతులు చెప్పటం మొదలెట్టాడు. నిన్న ప్రొద్దున రైలుకు తాను వచ్చిన సంగతీ, తల్లి కొంచెం కులాసాగా ఉన్న సంగతీ, ఆ పశ్చిమదేశం సంగతులూ అని ఎన్నెన్నో చెప్పి చెప్పి చివరకు ఆ అపరిచిత యువకుడి ముఖం కేసి చూచాడు.

గురుచరణుడు ఈలోపుగా కొంతవరకు తెప్పరిల్లుకుని ఆ యువకుణ్ణి పరిచయం చేస్తూ "ఇతడూ మా గిరీన్ స్నేహితుడు. ఒకచోటనే ఇల్లు. ఒకచోటనే కలిసి చదువుకున్నారు. చాలమంచి కుర్రాడు. శ్యాంబజారులో ఉంటున్నప్పటికీ మాతో పరిచయం అయినప్పటినుంచీ సాధారణంగా రోజుకోసారి చూసి పోతూ ఉంటాడు" అన్నాడు. శేఖరుడు తలతిప్పగా "అవును మంచివాడు!" అని తనలో తాను అనుకుని, కాస్సేపు మాట్లాడకుండా ఊరుకొని "బాబాయ్ అందరూ కులాసాగా ఉన్నారా?" అని అడిగాడు.

గురుచరణుడు జవాబివ్వలేదు. తల వంచుకుని ఊరుకున్నాడు. శేఖరుడు లేచి వెళ్ళబోతుండగా ఏదో గుర్తుకొచ్చినట్లు

"మధ్య మధ్య వస్తూ ఉంటు నాయనా! కేవలం పడిలి వెళ్ళ్యాను. విన్నావుగా సంగతులన్నీ!" అన్నాడు.

"వినకేం?" అంటూ లోపలికి వెళ్ళాడు శేఖరుడు.

తర్వాత లోపలినుంచి గృహిణి యేడుపు వినిపించింది. గురుచరణుడు బైటకూర్చుని పైపంచ కొంగుతో కళ్ళు తుడుచుకుంటున్నాడు. గిరీన్ ఏదో అపరాధం చేసిన వాడిలా ముఖం చిన్నపుచ్చుకుని కిటికీలోంచి బైటికి చూస్తూ కూర్చున్నాడు. లలిత అంతకు మునుపే వెళ్ళిపోయింది అక్కడినుంచి.

కొంచెంసేపయాక శేఖరుడు వంట యింట్లోంచి బైట వచ్చి వరండా లోంచి మేడలోకి వెళుతుండగా చీకట్లో తలుపు చాటున లలిత నుంచుని వుండటం చూశాడు. అది సాష్టాంగ నమస్కారం చేసి లేచి నిలబడి కొంచెం అతనికి దగ్గరగా జరిగి, అతడి నుంచి ఏదో ఆశిస్తున్నట్లుగా కాసేపు నిశ్శబ్దంగా ఊరుకుని—తర్వాత కొంచెం వెనక్కి జరిగి "నా ఉత్తరానికి జవాబు రాయలే దేంచేత?" అని అడిగింది నెమ్మదిగా.

"ఏదీ? నాకు అందలేదే ఉత్తరం!—ఏం రాశావేం అందులో?"

"చాలా సంగతులు రాశా. అది పోనీండి. అంతా విన్నారుగా! ఇప్పుడు ఏమి ఆజ్ఞాపిస్తారో చెప్పండి"

శేఖరుడు నవ్వుతూ "నా ఆజ్ఞ? నా ఆజ్ఞతో ఏం పని?" అన్నాడు.

లలిత సంకోచిస్తూ శేఖరుడి ముఖంకేసిచూస్తూ "ఎందుకని?" అని అడిగింది.

"ఎందుకని ఏమిటి లలితా! నేను యెవరిని ఆజ్ఞాపిస్తాను?"

"నన్నే. ఇంకెవరిని ఆజ్ఞాపిస్తారు?"

"నిన్నుమాత్రం ఎందు కాజ్ఞాపిస్తాను? అథవా ఆజ్ఞాపిస్తేమాత్రం నువ్వెందుకు వింటావు?" శేఖరుడి కంఠస్వరంలో కొంచెం కరుణా గాంభీర్యం వ్యక్తమయినాయి.

లలిత మనస్సులో చాలా భయపడుతూ మరోసారి దగ్గరగా వచ్చి ఏడ్పుగొంతుతో "పోండి, ఇలాంటప్పుడు వేళాకోళాలాడితే బాగుండదు నాకు. మీ కాళ్ళమీద పడతాను. ఏం చెయ్యమంటారో చెప్పండి. భయంతో రాత్రిళ్లు నాకు నిద్ర కూడా పట్టటంలా" అన్నది.

"భయం దేనికి?"

"బాగుంది, భయం వుండదూ? మీరు దగ్గరలేరాయె! అమ్మ దగ్గరలేదాయె! ఈలోపున మామయ్య ఇలాంటిపని చేసి కూర్చుండె. ఇప్పుడు అమ్మ నన్ను ఇంట్లోకి రానియ్యకపోతే!"

శేఖరుడు ఒకక్షణం మెదలకుండా ఊరుకుని, "అది నిజమే. అమ్మ రానివ్వదు. మీ మామయ్య వాళ్ళదగ్గర డబ్బు తీసుకున్నాడన్న సంగతి ఆమె విన్నది. అదీగాక ఇప్పుడు మీరు బ్రహ్మసమాజికులు, మేము హిందువులం" అన్నాడు.

అన్నాకాళి ఈ సమయంలో వంట యింట్లోంచి, "చిన్నా, అమ్మ పిలుస్తోంది" అని కేకేసింది.

లలిత బిగ్గరగా "వస్తున్నాను" అని, తర్వాత గొంతు తగ్గించి "నామీద ఎవరైనా కానీండి, మీరు ఎవరో నేనూ అదే.

అమ్మ మిమ్మల్ని వదులుకోలేకపోతే నన్నూ వదులుకోలేరు. ఇహ గిరీన్ బాబు దగ్గర డబ్బుతీసుకున్న సంగతి—అంటారా— అది నేను తీర్చేస్తాను. అప్పుచేసిన సొమ్ము రెండురోజులు ముందో వెనకో ఎటూ తీర్చాల్సిందేగా!" అన్నది.

"అంత డబ్బు ఎక్కడినుంచి వస్తుందీ నీకు?" అని అడిగాడు శేఖరుడు.

లలిత శేఖరుడి ముఖంకేసి ఒక్కసారి కళ్లెత్తి చూసి, క్షణం మెదలకుండా ఊరుకుని "నాకు తెలియదు, ఆడవాళ్ళందరికీ డబ్బు ఎక్కడనుంచి వస్తుందో - నాకూ అక్కడనుంచే వస్తుంది" అన్నది.

ఇంతవరకూ శేఖరుడు పైకి ఎంత నిగ్రహించుకుని మాట్లాడుతున్నా లోపల మండిపోతున్నాడు. ఇప్పుడు ఎకసక్కెంగా "మీ మామయ్య నిన్ను అమ్మేశాడుగా!" అన్నాడు.

లలిత చీకట్లో శేఖరుడి ముఖభంగిమ చూడలేకపోయింది. కాని గొంతులో మార్పు కనిపెట్టింది. ఆమె క్రుద్ధస్వరంతో "అదంతా వొట్టిది. మా మామయ్యలాంటివాళ్ళు లోకంలో మెవ్వరూ లేరు. మీరు ఆయన్ని హేళన చెయ్యొద్దు. ఆయన కష్టాలు మీరు తెలుసుకోలేకపోయినా లోకానికంతటికీ తెలుసు" అని ఒకసారి గుటకమింగి, కొంచం తటపటాయించి చివరకు "అదీగాక ఆయన డబ్బు తీసుకున్నది నా పెళ్ళి అయినాకే. అందుచేత నన్ను అమ్మే అధికారం ఆయనకు లేనూలేదు, ఆయన అమ్మనూలేదు. ఈ అధికారం

నా ఒక్కరిదే. మీరు తెలుసుకుంటే డబ్బు ఇవ్వాల్సి వస్తుంది అన్న భయంతో అమ్మివేయగలరు ఖచ్చితంగా" అని జవాబు కోసం ఎదురుచూడకుండానే గబగబా వెళ్ళిపోయింది అక్కడి నుంచి.

## ౬

ఆ రాత్రి చాలా ప్రొద్దుపోయేదాకా స్నేహితుల వెంట తిరిగి యింటికివచ్చి శేఖరుడు ఆలోచనలో పడ్డాడు — తన కళ్ళముందు పెరిగిన చిన్న చిన్నటి లలిత ఇంత ఎదిగిందా! మాటలెలా నేర్చుకుంది! సిగ్గువిడిచి తనముందర ఇన్ని మాటలు ఎలా మాట్లాడ గలిగింది?

ఇవాళ లలిత ప్రవర్తన నిజంగా అతడికి ఆశ్చర్యాన్ని, కోపాన్ని కూడా కలిగించింది. కాని ఈ కోపానికి అసలు కారణం ఏమిటో కొంచెం శాంతంగా ఆలోచించి చూస్తే ఆ కోపం లలితమీద కాదు, తనమీదనే అని అతడికి తెలిసేది.

లలితను ఈ కొద్దిమాసాలూ ప్రవాసంలో ఉంటూ అతను కేవలం భావనా ప్రపంచంలో విహరిస్తూ కాల్పనిక సుఖ దుఃఖాలూ లాభనష్టాలూ ఆలోచించి చూస్తున్నాడు.

కాని లలిత యిప్పుడు తన భవిష్యత్ జీవితంలో ఎంతో ముడిపడివుందో, ఆమె లేకుండా వుండటం ఎంత కష్టతరమో, ఎంత దుఃఖకరమో పక్క-మీద పడుకుని ఈ విషయాన్నే ఆలోచించసాగాడు. లలిత చిన్నప్పటినుంచే తన కుటుంబంలో

కలిసిపోయింది కనుకనే, ప్రత్యేకించి తన కుటుంబంలో తల్లి దండ్రులూ, అన్నదమ్ములూ మధ్య ఆమెకు ఎలాంటి స్థానమున్నదీ అన్న సంగతి అతడెన్నడూ ఆలోచించలేదు. ఆలోచించవలసినంత అవసరమూ కలగలేదతడికెప్పుడూ. లలితను పొందటం అసాధ్యం. తన తల్లిదండ్రులు ఈ వివాహానికి సమ్మతించరు. ఆమె మరెవరికో దక్కుతుంది. ఈ ఆలోచనలే వేధిస్తుండేవి అతన్ని. అంచేతనే ప్రవాసానికి వెళ్ళేముందు రోజు రాత్రి ఆమె మెళ్ళో బలవంతాన దండ వేసి, ఈ దిగుళ్ళను కొన్నిటిని వదిలించుకున్నాడు.

ప్రవాసంలో ఉంటూ గురుచరణుడు స్వధర్మాన్ని త్యజించి పరధర్మాన్ని స్వీకరించాడని విని ఎంతో వ్యాకుల పడటమే కాకుండా లలితను వదులుకోవాల్సివస్తుందేమో నని బెంగపెట్టుకున్నాడు కూడా. సుఖంలో కాని, దుఃఖంలో కాని అతని ఆలోచనలు ఎప్పుడూ లలితమీదకే ప్రసరించేవి. ఇవాళ లలిత స్పష్టంగా చెప్పినమాటలు అతని ఆ ఆలోచనలను అరికట్టి, అతడి భావనాప్రవాహాన్ని ఎదురు ప్రవహింపచేశాయి. అప్పుడు లలిత తనకు దక్కదేమోనని బెంగ. ఇప్పుడు లలిత తనను విడిచిపెట్టదేమోనని దిగులు.

శ్యాంబజారు సంబంధం ఉత్తదయింది. వాళ్ళు అంత కట్నం యివ్వటానికి వెనుకాడారు. శేఖరుడి తల్లికి ఆ పిల్ల అంతగా నచ్చనుకూడా లేదు. కనుక శేఖరుడు ఈ సంబంధం నుంచి తప్పించుకోగలిగాడు నిజమే; [illegible] నవీనరాయు పదిహేను వేలు—ఇరవై వేల కట్నంమాత్రం జారవిడిచిపోయాడు.

ఆయన ఇంకా ప్రయత్నంనుంచి పూర్తిగా విరమించుకోనూ లేదు.

'ఏమిటీ చెయ్యటం' అనే ఆలోచనలో పడ్డాడు శేఖరుడు. ఆరాత్రి తాను చేసినపని ఇంత యిదిగా పరిణమిస్తుందని, తనకు వివాహం అయిపోయిందని లలిత ఇంత నిస్సంకోచంగా విశ్వసిస్తుందనీ, ధర్మతః ఏ కారణంవల్లాకూడా ఇది మారటానికి వీల్లేదనీ–ఇన్ని విషయాలు ఇంతదూరం శేఖరుడు ఆ రోజున ఆలోచించి చూసుకోలేదు. "అయిందేమో అయిపోయింది. ఇంక నువ్వు తప్పుకోలేవు. నేనూ తప్పించుకోలేను" అని ఆ రోజున శేఖరుడు తన నోటిమీదుగానే అన్నా, అసలు ఇవాళ ఆలోచించుకున్నట్టుగా ఆ రోజునే ఆలోచించి చూసుకునేటంత సామర్థ్యం లేకపోయింది అతనికి. బహుశః అంత అవసరంకూడా కలిగిఉండక పోవచ్చు ఆనాడు.

అప్పుడు పైన చంద్రుడు వెలుగుతున్నాడు. నాలుగు వైపులా వెన్నెల మిలమిలా వ్యాపించింది. మెళ్లో దండ వ్రేలాడుతోంది. ప్రియురాలి హృదయస్పందనంలో తన హృదయాన్ని ఆమె వక్షస్థలానికి ఆనించవలెననే ప్రథమానుభవ మోహం ఉంది. ప్రేమికులు ఆరాధించే అధరామృతాన్ని ఆస్వాదించాలనే తీవ్రమైన కాంక్ష ఉంది. అప్పుడతను స్వప్నపురుషుడు మాత్రమే. సాంసారికమైన మంచిచెడులు తనకు స్ఫురణకు రాలేదు. ధనలోభియైన తండ్రి రుద్రస్వరూపం అతని కళ్ళకు పొడకట్టలేదప్పుడు. లలిత అంటే తల్లికి ఎటూ ఆపేక్షే కనుక ఆమెను ఒప్పించటం అంత కష్టం కాదనుకున్నాడు. అన్నగారి ద్వారా చెప్పించి ఎలాగో అలా తండ్రి మనస్సును [illegible]

కాన్గా సానుకూలం చేసుకోవచ్చు అనుకున్నాడు. అదీగాక గుణేని ఇతడు అప్పుడు తాను ఇలా నాశనమై, తన ఆశాపథానికి ఇలా అడ్డుపడలేడు. ఇప్పుడు ఆ విధాతే అడ్డుపడి కూర్చున్నాడు.

వస్తుతః శేఖరుడు అంతగా ఆలోచించవలసిందేమీ లేదు కూడ. తండ్రిని సమ్మతింప చేయటం మాట అలావుంచి, అసలు తల్లిని సమ్మతింప చేయటంకూడా అసంభవమే అని అతనిప్పుడు స్పష్టంగా గ్రహించాడు. అసలు ఇహ ఈ విషయం ఎత్తటానికి కూడా మార్గం కనిపించటం లేదు.

శేఖరుడు దీర్ఘంగా నిట్టూర్చి, 'ఏమిటి చెయ్యటం' అని మరోసారి తనలో గొణుక్కున్నాడు. అతడికి లలిత స్వభావం పూర్తిగా తెలుసు. ఆమెను తనే ఇంతదాన్ని చేశాడు. తాను ఒకసారి ధర్మము అని విశ్వసించిన దానిని ఆమె యెన్నడూ పరిత్యజించదు. తాను శేఖరుని ధర్మపత్నినని ఆమె విశ్వసించింది. అందుచేతనే ఇవాళ సాయంకాలం చీకట్లో నిస్సంకోచంగా హృదయానికి దగ్గరగా జరిగివచ్చి, ముఖంమీద ముఖంపెట్టి అలా నుంచుని మాట్లాడగలిగింది.

గిరీనుడికి ఆమెనిచ్చి చేయాలనే సంప్రదింపులు జరుగుతున్నాయి. కాని ఆమెను ఎవ్వరూ ఇందుకు సమ్మతింప చేయలేకుండా ఉన్నారు. అదీగాక ఇహ ఏవిధంగానూ నోరు మెదల్చకుండా ఊరుకోదు. ఇప్పుడంతా బైట పెట్టేస్తుంది. శేఖరుడి ముఖమూ కళ్ళూ ఉత్తప్తమయినాయి. కేవలం తాను దండ ఒకటే [illegible] వేసి మెదలకుండా ఊరుకోలేదు. ఆమెను తన [illegible] చేర్చుకొని ముద్దుపెట్టుకున్నాడు కూడా.

లలిత అభ్యంతరం పెట్టలేదు. తప్పులేదనే ఉద్దేశంతోనే అభ్యంతరం పెట్టలేదు. అందుకు తనకు తగిన అధికారం వుందనే ఉద్దేశంతోనే అనుచెప్పలేదు. ఇప్పుడు దీనికి జవాబు యెవరైనా అడిగితే యేమిటి ఇవ్వడం?

తల్లితండ్రులకు ఇష్టంలేకుండా వివాహం చేసుకోవటం అసంభవం. అదియెటూ నిశ్చయమే. కాని గిరీనుని లలిత వివాహం చేసుకోకపోవటానికి కారణమేమిటో బైటపెట్టాక తాను ఇంట్లోనయినా బైటనయినా ఎలా ముఖమెత్తుకు తిరగటం?

## ౧౦

ఎటూ అసంభవమనే ఉద్దేశంతో శేఖరుడు లలితమీద ఆశ పూర్తిగా వదులుకున్నాడు. మొదట్లో అతడు కొన్నాళ్ళు—లలిత ఎప్పుడు హఠాత్తుగా తన ప్రక్కన వచ్చి కూర్చుంటుందో, ఈ సంగతులన్నీ ఎక్కడ బైటపెడుతుందో, అందరి యెదుటా తాను జవాబుదారీ వహించవలసి వస్తుందేమోనని మనస్సులో మహా భయపడేవాడు. కాని తనను యెవరూ సంజాయిషీ అడగలేదు, అసలు ఈ విషయం ఏమాత్రమయినా బైటపడిందీ లేనిదీకూడా తెలియలా అతడికి. వారింటికి వీరుగాని, వీరింటికి వారుగాని, రాకపోకలుకూడా సాగించటంలేదు. శేఖరుడి గది ముందరి వరండాలో నిలబడి చూస్తే లలితవాళ్ళ డాబా అంతా కనబడుతుంది. ఆమె ఎక్కడ కనిపిస్తుందో అన్న భయంతో అక్కడ నిలబడేవాడుకూడా కాదు. కాని అలాంటి ఆపదలేవీ రాకుండా ఒక నెల గడిచిపోయేసరికి అతడు ప్రశాంతంగా

నిట్టూర్చి "ఏమయినా ఆడపిల్లలకు సిగ్గూ-భిడియాలు ఉండక మానవు. ఇలాంటి సంగతులన్నీ వాళ్లు బైటపెట్టలేరు" అని అనుకున్నాడు తనలో తాను. ఈ ఆడజాతి హృదయం పగిలి పోతున్నా నోరుమాత్రం విప్పదని ఎవరో చెప్పగా విన్నా డతడు. అది నిజమేనని విశ్వసించా డిప్పుడు. భగవంతుడు వాళ్ళ శరీరంలో ఇంత దుర్బలత్వాన్ని ఏర్పాటు చేసినందుకు ఆయన తెలివితేటలకు మెచ్చుకున్నాడు. అయినా అతడి మనస్సుకు శాంతి కలగటంలే దెందుచేతనో! ఇంక భయం లేదని ఎప్పుడైతే అనుకున్నాడో అప్పటినుంచీ ఏదో తెలియని బాధ అతడి హృదయంలో కలగసాగింది. ఆగి ఆగి, అతడి హృదయాభ్యంతరాళం నిరాశ, వేదన, ఆశంకలతో ఉడికెత్తి పోతోంది ఎందుచేతనో? లలిత ఈ విషయం ఎప్పుడూ వెల్ల డించదా ఇక? ఆమెను ఒక అయ్యచేతిలో పెట్టేంతవరకూ నోరు మెదల్పకుండా ఊరుకుంటుందా? ఆమెకు పెళ్ళిఅవటం, అత్తవారింటికి వెళ్ళటం — ఈ విషయాలు తలుచుకునేసరికే అతని మనస్సూ, శరీరంకూడా దహించి వేస్తున్నట్లుంది, ఎందు చేతనో?

ఇదివర కతడు సాయంత్రమప్పుడు షికారుకు వెళ్ళకుండా గదిముందుండే వరండాలో పచార్లు చేస్తూండేవాడు; ఇవాళకూడా అలాగే పచార్లుచేయటం మొదలెట్టాడు. కాని ఒకనాడుకూడా ఆ యింట్లోవాళ్ళెవ్వరూ డాబామీద కనిపించనే లేదు. ఒక్క రోజునమాత్రం అన్నాకాళీ ఎందుకో డాబామీదికి వచ్చింది కాని తాను కనపడగానే దృష్టి అటు త్రిప్పుకుంది. లా

ఆమెను పలకరించుదామా వద్దా అని అనుకుంటుండగానే వెళ్ళిపోయింది అక్కడినుంచి. వారి ఇంటికీ ఈ ఇంటికీ మధ్య దారికి అడ్డంగా గోడ కట్టించడంలో అంతరార్థం చిన్నపిల్ల కాళీకూడా గ్రహించింది అనుకున్నాడు శేఖరుడు మనస్సులో.

మరోనెల గడిచిపోయింది. ఒకరోజున భువనేశ్వరి ఏదో మాటల సందర్భంలో "ఈమధ్య నువ్వు లలితను ఎప్పుడైనా చూశావుట్రా శేఖర్?" అని అడిగింది.

"లేదు, ఎందుకు?" అన్నాడు తలత్రిప్పకుండా శేఖరుడు.

"ఇంచుమించు రెణ్ణెల్లను మొన్న డాబామీదికి వస్తే చూశాను. పిల్ల అదేమిటో ఓ రకంగా మారిపోయింది. ముఖం ఏదో జబ్బుపడినట్లు వాడిపోయింది. వయస్సు కల్గిన మనిషిలా కనిపించింది. అంత గాంభీర్యం అదీ చూస్తే పద్నాలుగేళ్ళ పిల్ల అని ఎవరు చెప్పగలరు చెప్పు?" ఆమెకళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. కొంగుతో కన్నీళ్లు తుడిచేసుకుని గద్గద కంఠంతో చెప్పసాగిందామె. "మాసిపోయిన చీరెలు కడుతోంది యిప్పుడు. 'నీకు చీరెలు లేవా అమ్మా?' అని అడిగాను. ఉన్నాయని అనట మయితే అంది కాని, నాకు నమ్మకం కలగలా. అది మొన్నదాకా వాళ్ళ మామయ్య తెచ్చినచీరె కట్టుకుని ఎరగదు. నేనే ఇస్తూండేదాన్ని. అయిదారు మాసాలనుంచీ నేను ఒక్క చీరె కూడా ఇచ్చిఎరుగను" ఇంక ఆమె మాట్లాడలేకపోయింది. పమిటచెంగుతో కళ్ళు ఒత్తుకోసాగింది. లలితను నిజంగా తన స్వంత కూతురిలా ప్రేమిస్తూ ఉంటుందామె.

శేఖరుడు మాట్లాడకుండా మరోవైపుకు చూస్తూ కూర్చున్నాడు.

చాలాసేపయాక ఆమెమళ్ళీ చెప్పటం మొదలెట్టింది. "నన్ను తప్ప అది ఎన్నడూ ఇంకొకర్ని ఏమీ అడిగి ఎరుగదు. నేలకాసిపేక ఆకలివేసినా ఇంట్లో నెవర్నీ అడిగేదికాదు. నన్నూ అడిగేదికాదు. నావెంటే వెంటతిరుగుతూ ఉండేది. నేనుదాని ముఖం చూడగానే గ్రహించేదాన్ని. ఆసంగతి నాకు జ్ఞాపకం వస్తూ ఉంటుంది శేఖర్. బహుశా అలాగే ముఖం వేళ్ళాడేసుకొని తిరుగుతూ ఉంటుందనుకుంటా. అది యెవ్వరూ గ్రహించలేరు. అడగనుకూడా అడగదు. నన్ను ఊరికే అమ్మా అని పిలవటమే కాదు. తల్లిలాగనే ప్రేమించేది.

శేఖరుడు సాహసించి తల్లి ముఖంకేసి చూడలేక పోయాడు. అటువైపు తిరిగి అలాగే కూర్చుని "సరేకాని అమ్మా! మరి, పిలిచిఏంకావాలో అడిగి ఇవ్వలేకపోయివా?" అన్నాడు.

"ఎలా తీసుకుంటుంది? వచ్చే దారికూడా మూసి వేయించివేశారాయె. నేను మాత్రం ఏముఖం పెట్టుకుని ఇవ్వను? మరిది ఏదో కష్టాల్లో ఉండి తెలిసో తెలియకో పొరపాటు చేశాడో అనుకో మనం ఏదో ప్రాయశ్చిత్తం అది చేయించి మనవాళ్ళ లాగ కలుపుకోవటంలేదు. ఏకంగా వెలివేసెయ్యటమేనా! అసలదీ కాక ఇదిలా పీడించటం వల్లనే వాళ్ళింకా కలిశారు. ఎప్పుడూ పేచీలే—మనుష్యను అసహ్యం పుట్టాక మానవుడు ఏపనైనా చేయగలుగుతాడు. అసలాయన ఒకరికోసంగా మంచిపనే చేశాడంటాను నేను. మన అందరి

కన్నా ఆగిరీన్ అతనికి ఎక్కువ ఆత్మీయుడు. లలితను అతడి కిచ్చి పెళ్ళిచేసేస్తే అది సుఖపడుతుంది—నేను చెపుతున్నానుగా? వచ్చేనెలలోనే అవుతుందని కూడా విన్నాను"

చటుక్కున శేఖరుడు ముఖం ఇటు త్రిప్పి "వచ్చే నెల లోనేనా?" అని అడిగాడు.

"అలా అనే విన్నాను"

శేఖరుడు డింకేమీ అడగలేదు.

తల్లి కొంచెంసేపు వూరుకుని అన్నది. "వాళ్ళ మామయ్యను వంట్లో బాగుండటం లేదని కూడా లలిత చెప్పగా విన్నాను. ఎలా ఉంటుందిలే అసలు? అతడికి ఒక మూల మనస్సుకు శాంతి అన్నదే లేకపోయె! ఆపైన ఎప్పుడూ ఇంట్లో ఏడుపులూ పెడబొబ్బలూ ఆయె! ఒక్కనిమిషంకూడా అత డికి ఇంట్లో శాంతిలేదు."

శేఖరుడు మెదలకుండా వింటూ వూరుకున్నాడు.

ఒక్క క్షణం అయ్యాక తల్లి లేచివెళ్ళగానే అతడు లేచి వచ్చి పక్కమీదపడుకుని లలితనూగూర్చి ఆలోచించసాగాడు.

వీరి ఇల్లు ఉన్నసందు రెండు బళ్ళు తప్పుకోటానికి వీ లేనంత చిన్నసందు. ఒక బండిని బాగా ప్రక్కకులాగి ఆపి తేనే కాని రెండోది వెళ్ళటానికి వీల్లేదు. పది రోజులు పోయాక ఒకనాడు శేఖరుడు ఆఫీసునుంచి వస్తున్న బండి గురుచరణుడి వాకిట్లోకి వచ్చేసరికి ఆగవలసి వచ్చింది. శేఖరుడు దిగి కనుక్కుంటే డాక్టరుగారు వచ్చారని తెలిసింది.

గురుచరణుడికి ఒంట్లో బాగాలేదని అతను కొద్దిరోజుల కిందం తల్లి చెప్పగా విన్నాడు. ఆసంగతి జ్ఞాపకంవచ్చి ఇంటిక

అక్కణ్ణుండా ఏకాయెకిని గురుచరణుడి పడక గదిలోకి వెళ్ళాడు. ఏమేమీ ఆమాట! గురుచరణుడు నిర్జీవుడి లాగా ప్రక్కమీద పడి ఉన్నాడు. ఒక ప్రక్కన లలితా గిరీనుంలు విచార ముఖాలతో కూర్చుని ఉన్నారు. ఎదురుగా కుర్చీలో కూర్చుని డాక్టరు రోగిని పరీక్ష చేస్తున్నాడు.

గురుచరణుడు అస్ఫుట స్వరంతో కూర్చోమన్నాడు. లలిత తలమీద చెరగుమరి కొంచెం ముందుకు లాక్కొని ముఖం అటుత్రిప్పుకుని కూర్చుంది.

డాక్టరు ఆ ప్రక్క వీధివాడే. శేఖరుడు ఎరుగును. రోగం ఏమిటో పరీక్షించి మందు వ్రాసిఇచ్చి అతణ్ణి వెంట పెట్టుకుని బైటికివచ్చి కూర్చున్నాడు. గిరీన్ వెనకాలనేవచ్చి డాక్టరుగారికి ఫీజు యిచ్చాడు. డాక్టరు వెళ్ళబోయే ముందు "రోగం ఇంకా బాగా ముదరలేదు, కనుక ఈ సమయంలో గాలి మార్పుకు ఎక్కడికయినా తీసుకెళ్ళటం చాలాముఖ్యం" అని చెప్పాడు.

డాక్టరు వెళ్ళిపోగానే ఇద్దరూ ఒక్కసారిగా గురుచరణుడి గదిలోకివచ్చారు.

లలిత చేత్తో సైగచేసి గిరీనుని చాటుగా పిలిచి అతనితో ఏమో గుసగుస లాడుతోంది. శేఖరుడు ఎదురుగాఉన్న కుర్చీలో స్తబ్ధుడిలా గురుచరణుడికేసి చూస్తూ కూర్చున్నాడు. ఆయన ఇంతకు పూర్వం అటుకేసి తిరిగి పడుకున్న వాడలాగే పడుకున్నాడు. శేఖరుడు మళ్ళీ తిరిగివచ్చింది ఆయన మెలకువ.

కాస్సేపు అలాగే మెదలకుండా కూర్చుని శేఖరుడు లేచి వెళ్ళాడు. అప్పటికింకా లలితా గిరీనులు ఏదో గుసగుసలాడు తూనే ఉన్నారు. అతణ్ణి ఎవరూ కూర్చోమనీ అనలేదు, రమ్మనీ అనలేదు అతణ్ణి పిలిచి ఎవరూ ఒక్కమాటైనా మాట్లాడలేదు.

ఇవాళ అతడు—లలిత తనని ఒక కఠినమైన బాధ్యత నుంచి శాశ్వతంగా విముక్తుణ్ణి చేసిందని స్పష్టంగా తెలుసు కున్నాడు అతడింక నిర్భయంగా విశ్వసించవచ్చు. సందేహం లేదు లలిత ఇంక తనని అంటిపెట్టుకుని వుండదు. ఇంటికివచ్చి దుస్తులు మార్చుకుంటూంటే ఎన్నో సార్లు ఈ సంగతే జ్ఞప్తికి రాసాగింది. గిరీనుడే వాళ్ళకు పరమఆప్తుడన్న సంగతి ఇవాళ తాను స్వయంగా చూసివచ్చాడు. వాళ్ళ అందరికీ ఆధార భూతుడూ, లలితకు భవిష్యత్తులో ఆశ్రయభూతుడూ కూడా అతడే తానేమీకాదు. ఇలాంటి ఆపత్సమయంలో కూడా లలిత అతణ్ణి ఒక్క సలహాకాని మరేమీకూడా అడగలేదు.

అతడు చటుక్కున 'ఉస్' అంటూ ఈజీచెయిర్లో కూలబడ్డాడు లలిత తనని చూడగానే ముసుగు ముఖంమీదికి లాక్కుని ముఖం అటుతిప్పుకుంది. తానేదో పరాయి వాడయి నట్లు! కేవలం అపరిచితుడైనట్లు! అదీగాక తన కళ్ళముందే గిరీన్ణి చాటుకు పిలిచి ఎంతసేపు గుసగుసలాడింది! ఇప్పుడు అతగాడి వెంటనే నాటకం చూడటానికయినా వెళ్ళివచ్చి ఉండ వచ్చు.

బహుశా తనతోవున్న రహస్య సంబంధం సంగతి గుర్తుకువచ్చే సిగ్గుతో అలా ప్రవర్తించిందేమో అని మనస్సును సమాధాన పరచుకోవాలని ప్రయత్నించాడు. కాని అలాంటి

సంభవం? అలా గేకనుక అయితే ఇంత యిది జరిగినా ఇన్నాళ్లీ మధ్య ఏదోవిధంగా ఒక్కమాట అయినా అడగటానికి ప్రయత్నించదా?

చటుక్కున గది బైట తల్లి కంఠస్వరం వినిపించింది — "ఏరా! ఇంకా కాళ్ళూ చేతులూ కడుక్కో లేదా?—ప్రొద్దు కూకింది!" అన్నదామె.

శేఖరుడు హడావుడిగా లేచి, తల్లి తనముఖంకేసి ఎక్కడ చూస్తుందోనని—ముఖం మరోవైపుకు త్రిప్పుకుని గబ గబా క్రిందికి దిగి వెళ్ళిపోయాడు.

ఈ కొన్నాళ్ళనుంచీ ఎన్నో విషయాలు ఎన్నో రకా లుగా ఆలోచించి చూశాడు. కాని 'నిజానికి తప్పెవరిది?' అన్న సంగతిమాత్రం ఆలోచించలేకపోయాడు. ఆశాపూరిత మైన మాట ఒక్కటికూడా అతను ఇవాల్టిదాకా లలితతో చెప్పలేదు. పోనీ ఆమె అడిగేందుకైనా అవకాశం ఇవ్వలేదు. పైగా ఒకవేళ ఈ సంగతి బైటపడితే తాను ఎలాంటి బాధ్యత వహించాల్సి వస్తుందో అన్న భయంతో కొయ్యబారిపోతు న్నాడు. అయినా అన్నివిధాలా తప్పుఅంతా లలిత నెత్తిన రుద్దటానికి ఉపాయాలు వెతకటం మొదలెట్టాడు. కోపంతోనూ అభిమానంతోనూ అతడి మనస్సు లోపల్లోపల దహించుకు పోతోంది. బహుశా లోకంలో మగవాళ్ళంతా ఆలోచనలతో ఇలాగే దగ్ధమౌతూంటారు కాబోలు!

ఈ విధంగా ఒక వారంరోజులు గడిచిపోయాయి ఇవాళ సాయంత్రంకూడా నిస్తబ్ధంగా ప్రశ్న గదిమధ్య అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాడు. చటుక్కున గదిముందర ఏదో

చప్పుడు అయి ముఖమెత్తి చూసేసరికి ఆతడి హృదయం గతుక్కుమంది. కాళీ చెయ్యిపుచ్చుకుని లలిత గదిలోకి వచ్చి క్రింద పరిచివున్న కార్పెట్‌మీద కూర్చుంది.

"శేఖర్ దా! మేమిద్దరం నీకు నమస్కరించటానికి వచ్చాము. రేపు మేము వెళ్ళిపోతున్నాము" అన్నది కాళి.

శేఖరుడు మాట్లాడలేకపోయాడు. చూస్తూ ఊరుకున్నాడు.

"మీ పాదసన్నిధిని మేము చాలా తప్పులు చేసి ఉంటాము శేఖర్ దా! వాటినన్నిటినీ మరచిపో" అన్నది కాళి.

ఇందులో ఒక్కమాటకూడా కాళీ స్వంతం కాదనీ, ఆపిల్లది ఈ పాఠం నేర్చుకుని ఒప్పచెపుతోంది అని శేఖరుడు గ్రహించాడు.

"రేపు ఎక్కడకు వెడుతున్నారు మీరు?" అని అడిగాడు.

"పశ్చిమదేశం. నాన్నను తీసుకొని మేమంతా ముంగేరు వెళుతున్నాము—అక్కడ గిరీన్ బాబుగారి యిల్లు ఉంది. నాన్నకు నయమయినా ఇంక మేము తిరిగిరాము. ఇక్కడి నీళ్ళు నాన్నకు సరిపడి లేదని డాక్టరుగారు చెప్పారు"

"ఇప్పు డాయనకు ఎలావుంది?" అని అడిగాడు శేఖరుడు.

"కొంచెం నయమే" అని కాళీ చీరెచాటున దాచిన రెండు క్రొత్తచీరెలు తీసి చూపించి "పెద్దమ్మ మాకు కొని ఇచ్చిందివి" అన్నది.

లలిత యిప్పటివరకు మెదలకుండానే ఊరుకునివుంది. ఇప్పుడు మెల్లిగా లేచి టేబిల్ దగ్గరకు వెళ్ళి తాళంచెవి దాని మీదపెట్టి "బీరువా తాళంచెవి ఇప్పటివరకు నాదగ్గిరే ఉండి పోయింది" అని చిరునవ్వు నవ్వుతూ "కాని అందులో డబ్బు మాత్రం లేదు. అంతా ఖర్చు అయిపోయింది" అన్నది.

శేఖరుడు మెదలకుండా వూరుకున్నాడు.

"పద, వదినా! ప్రొద్దుపోతోంది" అన్నది కాళీ.

లలిత జవాబు చెప్పకముందే శేఖరుడు తడబడ పడుతూ "కాళీ! క్రిందికి వెళ్ళి నాకు రెండు తమలపాకులు తెచ్చిపెట్టు అమ్మా?" అన్నాడు.

లలిత కాళీచెయ్యి నొక్కిపట్టి నిలిపి, "నువ్వు ఉండు కాళీ! నేను వెళ్ళి తీసుకుని వస్తాను" అని గబగబా మెట్లు దిగి వెళ్ళింది. ఒక్కనిమిషంలో తమలపాకులు తెచ్చి కాళీ చేతి కిచ్చింది. ఆమె శేఖరుడి చేతికిచ్చింది.

తమలపాకులు తీసుకుని శేఖరుడు తెల్లపోయి అలాగే కూర్చున్నాడు.

"వెళుతున్నాము శేఖర్ దా!" అని కాళీ దగ్గరకువచ్చి అతడి పాదాలకు వంగి నమస్కరించింది. లలిత కూర్చున్న చోటునుంచే నేలమీదకు వంగి నమస్కరించగానే ఇద్దరూ లేచి మెల్లిగా బైటికి వెళ్ళిపోయారు.

శేఖరుడు తన ఆత్మగ్లానితోపాటు వివర్ణమైన ముఖం తోనూ, విహ్వలదృష్టితోనూ మతిపోయినవాడిలా కదలకుండా అలాగే కూర్చున్నాడు. లలిత వచ్చింది. చెప్పవలసిందేదో చెప్పి శాశ్వతంగా [illegible] వెళ్ళిపోయింది. కాని తాను

మాత్రం మాట్లాడలేకపోయాడు. మాట్లాడటానికేమీ సంగతులు లేనట్లుగా ఆ సమయంకాస్తా వెళ్ళిపోయింది. లలిత బుద్ధిపూర్వకంగానే కాళిని వెంటబెట్టుకు వచ్చింది. ఈ సంగతులేవీ మళ్ళీ పైకి రాకూడదని ఆమె అనుకొన్నట్లు శేఖరుడు గ్రహించాడు. తర్వాత అతడి శరీరమంతా ఏమిటో లాగుతున్నట్లు, తల తిరిగిపోతున్నట్లు వుండి అతడు లేచివెళ్ళి కళ్ళు మూసుకుని పక్కమీద పడుకున్నాడు.

## ౧౧

గురుచరణుడి అనారోగ్య దేహం ముంగేరు జల వాయువులను కూడా కోలుకోలేదు. అక్కడకు వెళ్ళిన నాల్గవ రోజునే ఆయన దుఃఖభారాన్ని దింపుకుని ఈ లోకంలో నుంచి వెళ్ళిపోయాడు. గిరీన్ నిజంగా ఆయనంటే ఎంతో అభిమానంగా ఉండేవాడు. చివరి ఘడియవరకూ అతడు చేయగలిగినదంతా చేశాడు.

చనిపోయేముందు గద్గద కంఠంతో గురుచరణుడు గిరీనుని చెయ్యిపట్టుకుని, "ఈ స్నేహాన్ని బంధుత్వంగా పరిణమింపజేయమనీ, తనకు ఇక్కడ కళ్ళతో చూసి ఆనందించేందుకు తన అనారోగ్యం మూలాగా వీలులేకపోయిందనీ, పరలోకంలోంచి అయినా తాను చూడగలననీ, "బ్రతిమాలి చెప్పాడు.

గురుచరణుడి యింట్లో అద్దెకున్న వారిద్వారా భువనేశ్వరి అప్పుడప్పుడు వీరి కబుర్లు తెలుసుకుంటూ ఉండేది. గురుచరణుడి మృత్యువార్త వారివల్లనే తెలిసిందామెకు.

తర్వాత కొద్దిరోజులకే గిరీనుడింట్లో కూడా పెద్ద దుర్ఘటన ఒకటి జరిగింది. నవీన్‌రాయ్ హఠాత్తుగా మరణించారు. భువనేశ్వరి గర్భంలో పిచ్చి దానైపోయి, సంసారభారం మొత్తం పెద్దకోడలికి అప్పగించి ఆమె కాశీవెళ్ళి పోయింది. వచ్చే సంవత్సరం అన్ని ఏర్పాట్లు చేసి ఉంచితే కాశీ నుంచి వచ్చి శేఖరుడి వివాహం జరిపించి వెడతానానని చెప్పి వెళ్ళింది

సంబంధం నవీన్‌రాయ్ స్థిరపరిచారు. ఇప్పటికసలు ఆ పెళ్ళి అయిపోవాల్సిందే. కాని ఆయన మృత్యువు మూలంగానే ఒక సంవత్సరం ఆగవలసి వచ్చింది. పిల్లతరఫువారు ఇంక ఆగరు. అంచేతనే వాళ్ళు నిన్న వచ్చి ముహూర్తం పెట్టుకుని వెళ్ళారు. ఈ నెలలోనే పెళ్ళి. ఇవాళ శేఖరుడు వెళ్ళి తల్లిని తీసుకు రావాలనే ప్రయత్నంలో ఉన్నాడు. బీరువాలోంచి దుస్తులూ అవీ తీసుకుని పెట్టెలో సర్దుకుంటుంటే చాలా రోజులకు నేడు ఇవాళ అతనికి లలిత జ్ఞాపకం వచ్చింది. ఇదివరకు ఈ పనులన్నీ ఆమే చేసిపెట్టేది. వాళ్ళు వెళ్ళి మూడేళ్ళు పైన అయింది. ఈ మధ్యకాలంలో వాళ్ళ సంగతులేవీ శేఖరుడు తెలుసుకోలేదు. తెలుసుకోవాలని ప్రయత్నించనూ లేదు. తెలుసుకోవాలని అనిపించనుకూడా లేదు. లలిత మీద క్రమంగా అతనికి ఒక అసహ్యభావం కలగసాగింది. కాని ఇవాళ ఎందుకో చటుక్కున 'ఆమె ఎలావుందో తెలుసుకుంటే బావుండును' అని బుద్ధిపుట్టింది. తప్పకుండా ఖులాసాగానే ఉండివుంటుంది. ఎందుచేతంటే గిరీనుడు శ్రీమంతుడు అని తనకు తెలుసు. అయినా పెళ్లి ఎప్పుడయిందో, అతనితో ఎలా వుంటుందో అన్నీ తెలుసుకోవాలని బుద్ధిపుట్టింది.

ఆ యింట్లో అద్దెకున్నవాళ్లు చెప్పారు. రెండు నెలల క్రితం ఖాళీచేసి వెళ్లిపోయారు. చారుబాల తండ్రిని వెళ్ళి అడుగుదామా అనుకున్నాడు ఒకసారి శేఖరుడు. ఎందుచేత నంటే గిరీంద్రుడి కబుర్లు వారికి తప్పక తెలుస్తూ ఉంటాయి. ఒక్కక్షణం పెట్టెలో సర్దుతున్న సామానులు అలాగే వదిలేసి శూన్యదృష్టితో కిటికీబైటికి చూస్తూ ఇవ్వన్నీ ఆలోచించ సాగాడు. ఆ సమయంలో ముసలిదాసీది ఒకతె గదిబైట నిల బడి "చిన్నబాబుగారూ, కాళీగారి అమ్మగారు మిమ్మల్ని ఒకసారి రమ్మంటున్నారు" అని చెప్పింది.

శేఖరుడు ముఖం ఇటుతిప్పి ఆశ్చర్యపోతూ "ఏ కాళీగారి అమ్మ?" అని అడిగాడు.

దాసీది చేత్తో గురుచరణుడి యింటికేసి చూపిస్తూ "మన కాళీగారి అమ్మ చినబాబుగారూ! వారందరూ! రాత్రి వచ్చారుగా ఊరునుంచి" అన్నది.

"పద, వస్తున్నా" అంటూ వెంటనే మేడదిగి వెళ్ళాడు.

అప్పటికి చాలా వేళ మించింది. అతడు ఆ యింట్లో అడుగుపెట్టగానే ఏడుపులు ప్రతిధ్వనించాయి. విధవ వేషంతో వున్న గురుచరణుని భార్యదగ్గరకు వెళ్లి అతడు క్రిందకూర్చుని కన్నీళ్లు తుడుచుకోసాగాడు నిశ్శబ్దంగా. కేవలం గురుచరణుడి కోసమే కాదు, అందులో పితృశోకం కూడా కలిసివుంది.

ప్రొద్దుక్రుంకగానే లలితవచ్చి దీపం వెలిగించి వెళ్ళిపో యింది. మామూలుగావుండే గళవస్త్రంతో అత్తకి నమస్కరించి, ఒక్క నిమిషం అలాగే నిలబడి మెల్లి మెల్లిగా వెళ్లిపోయింది.

శేఖరుడు పదిహేడేళ్ళ పరస్త్రీకేసి కన్నెత్తి చూడనూ లేకపోయాడు, పలకరించనూ లేకపోయాడు. అయినా ఓర కంట చూచినదాన్ని పట్టి, లలిత చాలా పెద్దదయినట్లు చాలా చిక్కిపోయినట్లు మాత్రం కనిపెట్ట గలిగాడు.

ఏడుపులూ అవీ అయాక గురుచరణుడిభార్య చెప్పిన సారాంశ మేమంటే, ఈ యిల్లు అమ్మేసి ముంగేరు వెళ్లి అల్లుడినగరే ఉండిపోవాలని తన ఉద్దేశం అని ఆ యిల్లు కొనా లని శేఖరుడి తండ్రికి చాలా రోజులనుంచీ ఉద్దేశం ఉంది; కనుక మామూలుధరకు వాళ్ళేకనుక కొంటే ఒక విధంగా సొమ్ము చేతుల్లో ఉన్నట్లే అవుతుంది. తమకుకూడా మన స్సుకు అంత కష్టంగా ఉండదు. అమ్ముతున్నందుకు ముందు ముందు ఎప్పుడైనా ఇక్కడికి వచ్చినా ఒకటి రెండు రోజులు అందులో ఉండటానికి అవకాశం ఉంటుంది...అని. ఇదీ ఆమె చెప్పింది. శేఖరుడు తల్లితో సంప్రతించి ప్రైలైనా తవారు మాస్తాను అన్నాడు. ఆమె కళ్లు తుడుచుకుని "అక్క ఈ మధ్య యెప్పుడూ రాదాయేం శేఖర్?" అని అడిగింది.

ఇవాళ రాత్రికే తాను ఆమెను తీసుకురావటానికి వెడుతున్నానని చెప్పాడు శేఖరుడు. తర్వాత ఆమె ఒక్కొ క్కటే ఎన్నో సంగతులు అడిగి తెలుసుకుంది. శేఖరుడి పెళ్లి యెప్పుడో సంబంధం యెక్కడో, కట్నం ఎన్నివేలో, నగలు ఎన్నో, నవీన్‌రాయ్ ఏమిచ్చి పోయాడో, ఇలాంటి సంగ తులు ఎన్నో అడిగి తెలుసుకుంది.

శేఖరుడు ఆమెదగ్గర శెలవు తీసుకునేసరికి వెన్నెల బాగా పైకి వచ్చింది. ఆ సమయంలో గిరీను మేడమీదనుంచి

దిగి వాళ్ళ అక్కగారి ఇంటికి కాబోలు వెళ్లాడు. గురుచరణుడి భార్య అది చూసి "మా అల్లుడితో నువ్వు ఎప్పుడూ మాట్లాడలేదా శేఖర్! ఇలాంటివాళ్ళు ప్రపంచంలో చాలా అరుదుగా గాని ఉండరు" అన్నది.

శేఖరుడికి ఆ మాటలో ఏమీ సందేహం కలగలా. అతడితో తనకు పరిచయం వుందని చెప్పి గబగబా బైటికి వెళ్ళాడు శేఖరుడు. కాని బైటగది ముందరికి వచ్చేసరికి అతడు చటుక్కున ఆగిపోవాల్సి వచ్చింది.

చీకట్లో తలుపుచాటున నిలబడివుంది లలిత. "ఇదిగో, మిమ్మల్నే. అమ్మనితీసుక రావటానికి ఇవాళే వెడుతున్నారా?" అని అడిగింది.

"ఊఁ"

"ఆవిడ బాగా అస్వాస్థ్యపడి పోయిందా?"

"ఆఁ ఇంచుమించు పిచ్చి యెత్తినట్లయింది"

"మీ వంట్లో కులాసాగా వుందా?"

"కులాసానే వుంది" అంటూ శేఖరుడు గబగబా వెళ్లిపోయాడు.

రోడ్డుమీదికి వచ్చాక సిగ్గుతో అతని శరీరం ఆపాదమస్తకం వణికిపోయింది. లలిత ప్రక్కను నుంచోటం తన శరీరంకూడా అపవిత్రమైనట్లు తోచసాగింది అతనికి మనస్సును ఇంటికి తిరిగివచ్చి ఎలాగో అలా పెట్టి సర్దేశాడు. అప్పటికింకా రైలుకు వేళ ఉండటంమూలంగా కాస్సేపు పక్కమీద పడు

కుని, విలిప్తమయిన లలిత స్మృతిని, నిశ్శేషంగా కాల్చివెయ్యాలనే పట్టుదలతో మనస్సులో 'అసహ్య'మనే దావానలాన్ని ప్రజ్వలింపచేసుకో సాగాడు. ఆ మంటలో అతడు లలితను అనరాని మాటలన్నీ అంటూ దూషించాడు. చివరకు 'కులట' అనటానికికూడా సంకోచించలేదు. అప్పుడు మాటల సందర్భంలో గురుచరణుడి భార్య 'ఇది సంతోషంతో చేసిన పెళ్ళికాదు. అందుచేత చివరి క్షణంవరకూ ఎవరిమూ అనుకోనేలేదు. లేకపోతే లలిత అప్పుడు మిమ్మల్నందర్నీ పిలవమనే చెప్పింది' అని బైటపెట్టింది. లలితయొక్క ఈ స్పర్ధ అతని కోపాగ్నిని మరింత ప్రజ్వరిల్ల చేసింది.

౧౨

శేఖరుడు తల్లిని తీసుకుని తిరిగివచ్చిన నాటికి అతడి పెళ్ళి యింకా పదిపన్నెండు రోజులుంది.

రెండుమూడు రోజులు పోయాక ఒకనాడు ప్రొద్దున్నే లలిత శేఖరుడి తల్లిదగ్గర కూర్చుని ఏదో పనిచేస్తోంది. లలిత వచ్చిందని శేఖరుడు యెరుగడు. అందుచేత అతడేదో పనిమీద 'అమ్మా' అంటూ గదిలో అడుగుపెడుతూనే తొట్రుపడి నిలబడిపోయాడు. లలిత తలవంచుకుని తనపని తాను చేసుకుంటోంది.

"ఎందుకురా?" అని అడిగింది తల్లి.

అతను ఏ పనిమీద వచ్చాడో అదికాస్తా మరిచిపోయాడు. "ఇప్పుడు కాదులే" అంటూ గబగబా బైటికి వెళ్ళి

పోయాడు. అతడికి లలిత ముఖం కనిపించలేదు. కాని అతడిదృష్టి మాత్రం లలిత చేతులమీద పడింది. ఆమె కేవలం నిరాభరణ కాకపోయినా చేతులకు రెండుగాజులుతప్ప ఇంకేమీలేవు. శేఖరుడు మనస్సులో బాగా నవ్వుకుని 'ఇదో వేషం' అనుకున్నాడు. గిరీన్ శ్రీమంతుడని అతని గృహిణి చేతులు ఇంత అలంకార శూన్యంగా వుండటానికి కారణమేమిటో మాత్రం శేఖరుడు ఊహించుకో లేకపోయాడు.

ఆ రోజున సాయంత్రం అతడు గబగబా మేడమెట్లు దిగివస్తున్నాడు. లలిత ఆ మెట్లమీదనుంచే పైకి వస్తూన్నదల్లా కొంచెం ప్రక్కకు తప్పుకుని నిలబడింది. శేఖరుడు దగ్గరకు రాగానే చాలా సంకోచిస్తూ మెల్లిగా "మీతో ఒకమాట చెప్పాలిస్తుంది" అన్నది.

శేఖరుడు ఒక్క క్షణం నిలబడి ఆశ్చర్యంతో "ఎవరితో? నాతోనా?" అన్నాడు.

లలిత అలాగే మెల్లిగా "అవును, మీతోనే" అన్నది.

"నాతో చెప్పేది ఏముంది!" అంటూ శేఖరుడు గబగబా క్రిందికి వెళ్ళిపోయాడు.

లలిత స్తబ్ధురాలై కాస్సేపు అక్కడ అలాగే నిలబడి చిన్న నిట్టూర్పు విడిచి మెల్లిగా వెళ్ళిపోయింది.

మర్నాడు ఉదయం శేఖరుడు తన చదువుల గదిలో కూర్చుని ఆరోజు పత్రిక చూస్తున్నాడు. అతడు అత్యాశ్చర్యంతో కళ్లుపైకెత్తి గిరీన్ గదిలోకి వస్తూండటం చూశాడు. గిరీనుడు నమస్కరించి ఒక కుర్చీ లాక్కుని కూర్చున్నాడు. శేఖరుడు ప్రతినమస్కారంచేసి పత్రిక ఒకవైపున పెట్టి ప్రశ్నా

శేఖరు డిప్పటివరకూ బాలీసుకు చేరగిలపడి కూర్చుని మాట్లాడుతున్న వాడల్లా సరీగ్గా లేచి కూర్చుని "ఎవరు చెప్పారూ?" అని అడిగాడు.

"చెల్లి లలిత చెప్పింది" అన్నాడు గిరీన్. శేఖరుడు విస్మయంతో మతిపోయినవాడిలా అయ్యాడు. తర్వాత గిరీన్ ఏం చెప్పాడో అందులో ఒక్క అక్షరంకూడా శేఖరుడి చెవిని పడలేదు.

ఒక్కక్షణం విహ్వలదృష్టితో అతని ముఖంకేసిచూస్తూ ఊరుకొని "క్షమించండి గిరీన్ బాబుగారూ! మీరు లలితను వివాహం చేసుకోలేదూ?"

గిరీనుడు నాలిక కరచుకుని, "చిత్తం, లేదు. వారి సాక్షి మీరు ఎరుగుదురుగా — కాలేని నేను —"

"కాని మొదట్లో అలా అనుకోలేదే?"

గిరీన్ లలితద్వారా అన్ని సంగతులూ తెలుసుకున్నాడు "లేదు, అలా అనుకోలేదు. ఆ మాటనిజమే. గురుచరణబాబు మృత్యుసమయంలో నన్ను వేరే మరో సంబంధం చేసుకోవద్దని కోరారు. నేనుకూడా అలాగే అని మాట యిచ్చాను. ఆయన చనిపోయాక చెల్లినాకు అన్నిసంగతులూ చెప్పింది — ఈ సంగతులన్నీ నిజంగా ఎవ్వరూ ఎరగక పోయినా అంతకుపూర్వమే ఆమెకు వివాహం అయిందిట! భర్త జీవించే ఉన్నాడటకూడా! ఈ సంగతి ఎవరూ విశ్వసించక పోవచ్చు కాని ఆమె ఏదిచెప్పినా నేను విశ్వసించకుండా ఉండలేను. అదీగాక స్త్రీలకు ఒక్కసారికన్న యెక్కువసార్లు వివాహం జరగదు కదా! — ఓ! అదేమిటి?" అన్నాడు గిరీనుడు.

శేఖరుని రెండు కళ్ళలో నీళ్ళు గిర్రున నిండాయి. ఇప్పుడు ఆభాష్పాలే కనుకొలకుల్లోంచి గిరీన్ ఎదుటే అశ్రు ప్రవాహంగా వెలువడసాగాయి. కాని అతడికా స్పృహలేదు. పురుషుడిఎదుట ఇలా పురుషుడిదౌర్బల్యం వ్యక్తం కావటం ఎంతో లజ్జాకరమన్న సంగతికూడా అప్పుడతనికి స్ఫురించలేదు.

గిరీన్ మెదలకుండా చూస్తూ ఊరుకున్నాడు. అతడి మనస్సులో సందేహం కద్దు ఇన్నాళ్ళ నుంచీ, ఇవాళ అతడు లలిత భర్త ఎవరో స్పష్టంగా తెలుసుకోగలిగాడు. శేఖరుడు కళ్ళు తుడుచుకుని గద్గదకంఠంతో "మీరు లలితను ప్రేమించ లేదూ?" అని అడిగాడు.

గిరీన్ ముఖంమీద ప్రచ్ఛన్నమైన వేదనచ్ఛాయలు కమ్ముకున్నాయి. కాని మరుక్షణంలోనే అతడు ముసిముసి నవ్వులు నవ్వసాగాడు. తర్వాత మెల్లిగా చెప్పాడు సమాధానం:

"ఆ ప్రశ్నకు జవాబివ్వటం అనవసరం అదీగాక ఎంతటి ప్రేమఅయినా తెలిసి తెలిసీ ఒకరు వివాహమాడినస్త్రీని మరొకరు ఎన్నడూ వివాహ మాడరు–ఆ సంగతి అలావుంచండి. పెద్దలను విమర్శించ తలుచుకోలేదు నేను." అంటూ అతడు మరోసారి నవ్వి లేచి నిలబడి–"ఇవ్వాల్టికి వెడతాను. మరోసారి కలుసుకుంటాను" అని నమస్కరించి వెళ్ళిపోయాడు గిరీన్.

శేఖరుడు చాలా రోజులనుంచీ గిరీన్‌ను మనసా ద్వేషిస్తూ వచ్చాడు, ఇటీవల ఆ ద్వేషం పగను అసహ్యంగా కూడా పరిణమించింది. కాని ఇవాళ అతడు వెళ్ళిపోగానే శేఖరుడు లేచి శిరస్సు నేలకు ఆనించి ఈ అపరిచిత బ్రాహ్మణుని

కుని ఉద్దేశించి ఎన్నోసార్లు నమస్కరించాడు. మానవులు నిశ్శబ్దంగా ఎంతటి స్వార్థత్యాగాన్ని చేయగలరో, నవ్వుతూ ఎంతటి కఠోర ప్రతిజ్ఞలనైనా చెల్లించగలరని ఇవాళ అతడు మొదటి సారిగా చూడగలిగాడు.

అపరాహ్ణసమయంలో భువనేశ్వరి తన గదిలో చాప మీద కూర్చుని లలిత సహాయంతో క్రొత్తగుడ్డలరాశిని వరుసగా పేర్చి బొత్తులు పెట్టి సర్దుతోంది. శేఖరుడు గది లోకి వచ్చి తల్లి మంచంమీదికి పోయి కూర్చున్నాడు. ఇవాళ అతను లలితను చూసి గాభరాపడుతూ పారిపోలేదు. తల్లి అతన్ని చూసి "ఏమిట్రా?" అని అడిగింది.

శేఖరుడు సమాధానం చెప్పలేదు. మొదలకుండా ఆ గుడ్డల బొత్తుల వంక చూస్తూ కూర్చుని ఒక్క క్షణమయ్యాక "ఏం చేస్తున్నావమ్మా?" అని అడిగాడు.

క్రొత్తగుడ్డలు ఎవరెవరికి యేయే రకానివి ఇవ్వాలో లెక్క చూస్తున్నాను. బహుశా ఇంకా కొన్నాళ్ళు వుంటుందను కుంటాను. కాదు తల్లీ?"

లలిత తలత్రిప్పుతూ ఔనన్నట్లు ఆమె మాటకు వత్తాసు యిచ్చింది.

శేఖరుడు నవ్వుతూ "ఒకవేళ నేను పెళ్ళిచేసుకోక పోతేనో?" అన్నాడు. భువనేశ్వరికూడా నవ్వింది.

"ఆc, నువ్వెందుకయినా తగినవాడివే. గుణాలకేం కొదువలేదు" అన్నది.

శేఖరుడు నవ్వుతూ "ఇప్పుడు నిజంగా అలాంటి పరిస్థితులే వచ్చాయి అమ్మా!" అన్నాడు.

"అవేం మాటలురా! అలాంటి అపశకునపు మాటలు మాట్లాడకు" అన్నది ఆమె గంభీరంగా.

"ఇంతవరకూ మాట్లాడలేదు నేనయినా. కాని ఇంక మాట్లాడకుండా ఉండటానికి వీల్లేదు. ఇంకా మెదలకుండా ఊరుకుంటే మహాపాపం చుట్టుకుంటుంది"

"భువనేశ్వరి ఆ మాటల్లోని అంతర్యం గ్రహించలేక శంకితదృష్టితో చూస్తూ ఊరుకుంది.

"నీ యీ బిడ్డని ఎన్నో తప్పులు ఇంతవరకూ క్షమిస్తూ వచ్చావు నువ్వు అమ్మా! నేను నిజంగానే చేసుకోను."

కొడుకు మాటలతీరు, ఆ ముఖమూ చూసి భువనేశ్వరి నిజంగానే ఉద్విగ్న అయింది. కాని తన ఉద్వే... పరచుకుని "సరే, సరే. అలాగేలే. ఇక... వెళ్ళు, నన్నట్టే వేధించక. నాకు... అన్నది.

శేఖరుడు మరోసారి న...
"ఊహూం. నిజం చెపుతున్నా...
కోను నేను" అన్నాడు శే...

"ఎందుకని? ఇ...

"అటు కాదు కన్న...

భువనేశ్వరి యీ...
"ఏం జరిగిందేం? నాకు...
మాటలు నాదగ్గర పని...

"మరోరోజున —పుతాలే అమ్మా! అప్పుడు విందువు గాని..." అన్నాడు శేఖరుడు.

"మరోరోజున యెప్పుడో చెబుతావా?" అంటూ ఆ క్రొత్తగుడ్డలన్నీ ఒక ప్రక్కకు నెట్టి "అయితే నన్ను ఇవ్వాళే కాశీకి పంపించెయ్. ఇలాంటి సంసారంలో నేను ఒక్క క్షణం కూడా ఉండలేను" అన్నది.

శేఖరుడు తలవంచుకుని కూర్చున్నాడు. భువనేశ్వరి మరింత అస్థిరచిత్తయై "లలితకూడా నాతోకూడా వస్తానంటోంది రేపు. అది రావటానికికూడా తగిన యేర్పాట్లు చూడాలి" అన్నది.

శేఖరుడు ఈసారి తల పైకెత్తి నవ్వుతూ "నువ్వు వెళ్తుంటే ఇంకా వేరే యేర్పాట్లూ అవీ యెందుకు ...నికి నీ ఆజ్ఞ కన్న మించిందేముందీ?" అన్నాడు.

...డుకు ముఖంకేసి చూసేసరికి ఆమెకు ... చిగురెత్తింది. ఒకసారి లలితకేసి ... నా తల్లీ! వాడి ఉద్దే... ఇష్ట... లే సులభంగా ...సుకెళ్ళగల ... అన్నది.

...మడి మాటల ... ...పడసాగింది.

...డుగు. అని ... ...లా అంటే ... ...లుసు. నవ్వు ...

వెళ్ళాలనుకుంటున్న వ్యక్తికీ తెలుసు. ఆమె నీకోడలు అమ్మా!" అనేసి శేఖరుడు మళ్ళీ తలవంచుకున్నాడు.

భువనేశ్వరి విస్మయంతో స్తంభితురాలయింది. తల్లి ఎదుట కొడుకు ఇలా పరిహాసంగా మాట్లాడటం ఏమిటి! [illegible]కేసి చూస్తూ "ఏమిట్రా అన్నావు? అది నాకేమవుతుం అన్నావ్?" అన్నది.

శేఖరుడు ముఖం పైకెత్తలేక పోయాడు కాని సమాధానం మాత్రం చెప్పాడు. "అదే చెప్పితినిగా అమ్మా! ఇవాళిటిసంగతి కాదుయిది. నాలుగేళ్ళకు పైన అయింది ఇది జరిగి. అది నిజంగా నీకోడలే. నేనింక చెప్పలేను, దాన్నే అడుగు, అదే చెబుతుంది" అని ఇటుచూచేసరికి లలిత గ[illegible] స్త్రీయై భువనేశ్వరికి నమస్కరించబోతోంది. శేఖరుడుకూడా లలితప్రక్కను వచ్చి నుంచున్నాడు. ఇద్దరూ కలిసి ఆమెకు పాదాభివందనం చేశాక శేఖరుడు మెదలకుండా బైటికి వెళ్ళి పోయాడు.

భువనేశ్వరి కళ్ళల్లో ఆనందాశ్రువులు జలజలలాడాయి. ఆమెకు లలిత అంటే ఎంతో ప్రేమ. నగలపెట్టె తీసుకువచ్చి అందులోవున్న తన నగలన్నీ పైకితీసి ఒక్కటొక్కటే లలితకు అలంకరిస్తూ, ఒక్కటొక్కటే అన్ని సంగతులూ అడిగి తెలుసుకుంది. అంతా విన్నాక "ఎందుకనేనా గిరీన్ కాళీని పెళ్ళి చేసుకుంది?" అని ప్రశ్నించిందామె.

"[illegible]. గిరీన్‌బాబులాంటి మనుష్యులు లోకంలో ఉంటారో ఉండరో నేనయితే ఎరుగనుకాని, నేను

ఇలా అని విడమర్చి 'నిజంగానే నాకు పెళ్లి అయింది నాథ
నన్ను స్వీకరించనీ, స్వీకరించకపోనీ—అది వారి ఇష్టం. కా
వారు జీవించే ఉన్నారు' అని చెప్పగానే ఆయన విశ్వ
చాడు" అన్నది లలిత.

భువనేశ్వరి ఆమెతల నిమురుతూ "ఉండకపో
మిటి తల్లీ! జన్మ జన్మలవరకూ దీర్ఘజీవి అయి వుండాలని
ఆశీర్వదిస్తున్నాను. కాస్సేపు ఇక్కడ కూర్చో అమ్మా
వెళ్లి అవినాశునితో పెళ్లికూతురు మారిందని చెప్పి వస్తా
అని నవ్వుముఖంతో పెద్దకొడుకు గదివైపుకు వెళ్లింది ఆమె



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA113B146 |
| --- | --- |
| పుస్తకం పేరు | పరిణీత |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | NO |
| తయారు చేసేవది | Apsana |
| పేజీలు విడదీసేవది | Apsana |
| స్కాన్ చేసేవది | Susmitha |
| పరీక్ష చేసేవది | prathyusha |
| పేజీలు పరిచూసేవది | |
| బైండింగు చేసేవది | |
| ప్యాకింగు చేసేవది | |
| పరిస్థితి | good |